

# గృహలక్ష్మి

స్త్రీలసచిత్రమాసపత్రిక

సంపాదకుడు:
డాక్టరు. కే. యన్. కేసరి

## GRIHALAKSHMI

LADIES' TELUGU MONTHLY

జూన్—1948



సంపుటము ౧౭] [సంచిక ౬




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక

# శ్రీ సర్వధారినామ సం॥ర జ్యేష్ఠ మాసము.

| | | | |
|---|---|---|---|
| | 8 | మం | శు. పాడ్యమి 27-31 మృ 27-52 రా 16-30 సమశృంగ చంద్రోదయం |
| | 9 | బు | వి. 23-5 ఆ 26-24 దా 22-11 తిథిద్వయం కదళీ గౌరీవ్రతం |
| | 10 | గు | తి. 17.3 పు 23-14 దా 9 26 చతుర్థీ తిథి రంభా గౌరీవ్రతం |
| | 11 | శు | చ. 12-15 పుష్య 19-31 దా 16-40 అరణ్య గౌరీవ్రతం |
| | 12 | శ | పం. 6-14 ఆ దా 10-51 ఉమా గౌరివ్రతం |
| | 13 | ఆ | ష 0-19 ఉష॥ సప్త॥ లలితావన గౌరీవ్రతం శ్రీ హంపీక్షేత్ర శతకుంభవిసర్జనం |
| | 14 | సో | అ. 47-59 పూఫ 7-8 షడశీతి పుణ్యకాలం |
| జూను | 15 | మం | న 42-48 ఉప 3.21 సరస్వతీ జయంతి |
| | 16 | బు | ద. 37-4 స్వా 55-39 సర్వేషాం గురువారవ్రతం. |
| | 17 | గు | ఏ 33-47 స్వా 55-39-సర్వేషాం గురువారవ్రతం. |
| | 18 | శు | ద్వా. 30 38 వి 54 4౦. రామలక్ష్మణ కూర్మజయంతి. |
| | 19 | శ | త్ర 28-39 అ 55-10-ది 5-0. విద్యారణ్యజయంతి. |
| | 20 | ఆ | చతు 27.56 జ్యే 56-40 శుక్రమౌఢ్యారంభం. |
| | 21 | సో | పౌ. ○ 28-28 మూ. 49-41 మరిచిపూర్ణిమా. |
| | 22 | మం | బ. పాడ్యమి 30-12 పూషా 60-0, ది 25 3. |
| 1948-వ సం॥ | 23 | బు | వి. 33 2 పూషా. 3.52 సత్యపూర్ణ తీర్థపుణ్యదినం. |
| | 24 | గు | తి. 37-0 ఉషా 9-8 రఘువర్య తీర్థ పుణ్యదినం. |
| | 25 | శు | చ 41-37 శ్ర 14.59 ది16-1, సంకష్ట హరగణ గౌరీవ్రతం. |
| | 26 | శ | పం. 46-49 ధ 21-20. బృందావన గౌరీవ్రతం. |
| | 27 | ఆ | ష 51-42 శత 28-0 రా 13-3. |
| | 28 | సో | స 56-14 పూభా. 24-9. ధ 24-1. |
| | 29 | మం | అ. 59-51 ఉభా 39 47 త్రిలోచన గౌరివ్రతం. చక్రమౌఢ్యవిరామం. |
| | 30 | బు | న. 60-0. రే 44 11 ది 12.4. |
| | 1 | గు | న. 2-5 అ 47-49 రా. 4-39 అగస్త్యాస్తమం. |
| | 2 | శు | ద. 3-37 ధ 49-59 ది 12-40. |
| | 3 | శ | ఏ. 3.41 కృ 50 56 సర్వేషాం ఏకాదశి. |
| జూలై | 4 | ఆ | ద్వా. 2 39 రో 40-26 ది 30-33 |
| | 5 | సో | త్ర. 0-7 ఉపరిచతు- 56-42 మృ 49.7 మాస శివరాత్రి. |
| | 6 | మం | అమా. ● 52-21 ఆ 47.47 అమావాస్యనం. |




జయజయ గృహలక్ష్మీ సఖీ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

## మదాం ప్రెసిడెంట్ పార్టీ

త్వరలో అమెరికాలో అధ్యక్షుని ఎన్నిక గానున్నది. రాజకీయవేత్తలు అందుకు సన్నాహము అగుచున్నారు. అయితే ఈసారి యొకనారీమణి ఆస్థాన మలంకరించునట్లు చేయవలయునని, "మదాం ప్రెసిడెంటు పార్టీ" యొకటి అక్కడ ఏర్పడి, కృషి సాగించుచున్నది - అని యొకవార్త. మేమీ ప్రయత్నమున కెంతయు హర్షించి ఇది ఫలప్రదమగునుగాక యని ఆశించుచున్నాము.

ఈ పార్టీ అభ్యర్థి ఎవ్వరో తెలుసుకొనుటకు న్యాయముగనే మా పాఠకు లువ్విళ్లూరుతుంటారు. ఈ పార్టీవారు ప్రజాభిప్రాయము నొకవిధముగా కనుగొన్నారట. ముగ్గురు స్త్రీలు ప్రజల దృష్టిలో నున్నారు: (1) రూజువెల్టుసతి (2) క్లారీబూత్ ల్యూస్: ఈమె నాటకరచయిత; ప్రచురణకర్తయగు హెన్రీల్యూస్ ఇల్లాలు; (3) విండ్సర్ ప్రభ్వి. వీరిలో విండ్సర్ ప్రభ్వియే మా కంగీకారము.

అమెరికా నేడు ప్రపంచ సమస్యల పరిష్కరించుటలో ముఖ్యపాత్ర వహించుచున్నది. రష్యాతో సమాలోచనలయందు పేచీలువేయుచు - బ్రిటనును తనవెంట నడిపించుకొనుచున్నది. అయితే బ్రిటన్ యొక్క పరిణత రాజనీతికి అమెరికా చాలమి ఈ సాంగత్యమునకు పోషకముగానున్నది. కాని నేడు ప్రపంచ సమస్యలు పరిష్కారము కావలెనంటే కేవలము రష్యాతో పోటీచాలదు. ప్రజాసామాన్యముయొక్క గోడుడుపగల్గు సామర్థ్యమును కావలయును. ఇది కేవలము ధనపు సంచులు గలగలలాడించుటతో పొసగదు. కరుణార్ద్రహృదయముతో గంజిపోసినను చాలును. అమెరికాకు ఆ

నూతనాదర్శమును కల్పించుటకు స్త్రీ హృదయము అచ్చట ప్రభుత్వము చేయవలయును. అందుచే మేము విండ్సర్ ప్రభ్విని సూచించితిమి. విండ్సర్ ప్రభువు - ప్రిన్స్ ఆఫ్ వేల్సు నాడు కార్మికపక్షపాతి. యడ్వర్డు చక్రవర్తిగా - బ్రిటిష్ సామ్రాజ్యాధిపత్యమును ఆమె హృదయ సామ్రాజ్యాధిపత్యముతో తులతూచి తక్కువయని విసర్జించినాడు. అట్టి త్యాగమునకు మూలమై-ఆయన మనస్సున కాలేమి యొక కొరతగా తోచకుండ చేయగల్గిన ఇల్లాలి - చాకచక్యము నేడు అమెరికా రాజ్యమును, ప్రపంచవ్యవహారములను నడుపుటకు తోడ్పడవలయును. కావున ఆమె ఉత్తమాభ్యర్థియని మా అభిప్రాయము.

ప్రపంచమున నేడు తాండవించుచున్నది జాత్యహంకారము; ఆ ఆభిజాత్యమదమున ఆంగ్లేయులు పెట్టినపేరు. ఒక సామాన్యమగు అమెరికన్ యువతిని వివాహమాడదలచెనని గదా వారు అష్టమ యడ్వర్డు చక్రవర్తిని రాజ్యభ్రష్టుని విండ్సర్, ప్రభువునుగా జేసి దేశమునుండి వెడలదరిమినది! మేరీరాణి తన 80 వ జన్మదినోత్సవపు విందునకు సమీపస్థుడైయున్న పెద్దకుమారుని పిలువలేదన్నను, ఆరవజార్జిరాజు బ్రిటిష్ సింహాసనమునకు (ఇప్పటికి) వారసురాలైన తనకుమార్తె వివాహమున కామె పెత్తండ్రిని పిలువలేదన్నను, ఈ రెంటికికారణము, ఆతని చెలువ కళత్రస్థానమీయ మనసొప్పకే యని, జ్ఞప్తికి తెచ్చుకొంటిమేని - ఆంగ్లాభిజాత్యాంధకారము ఎంత దట్టమో తెలియగలదు. ఈ అవమానమునకు, జాతీయావమానమునకు - అమెరికా హృదయమున కుందుట లేదందుమా? - నేడు అవకాశ మొదవినదికావున - విండ్సర్ ప్రభ్విని "మొదటి అమెరికా మదాం ప్రెసిడెంట్" గా ఎన్నుకొని ఆ కుందు తీర్చుకొను గాక.

అమెరికన్ రాజ్యాంగచట్టము ననుసరించి విదేశములతో ఒడంబడికల గావించునది అధ్యక్షుడే; యుద్ధకాలమున అధ్యక్షుడే సర్వసైన్యాధ్యక్షుడు. బ్రిటిష్ దీవులందు ప్రజాస్వామికమే పరిపాలన మొనర్చుచున్నను, ప్రభుత్వమంతయు ప్రభువు పేరిటనే సాగుచున్నది. కావున శాంతిసమయమున నాలుగుడాలర్లు అప్పు కావలయునన్నను, యుద్ధకాలమున నాలుగు ఆటంబాంబులు అరువు కావలయునన్నను ఆరవజార్జి ప్రభువు - విండ్సర్ ప్రభ్వి చేతులనుండి అందుకోవలసిన అగత్యమేర్పడుట అపూర్వ సన్నివేశము. అట్టి అగత్యమును అమెరికాదేశీయులు యీమెను అధ్యక్షురాలిగా నెన్నుకొన్నచో కల్పించిన వారగుదురు. అప్పుడు ప్రపంచముననే స్త్రీ స్వాతంత్ర్యమునకు - ముఖ్యముగా వివాహస్వాతంత్ర్యమునకు - మహోన్నత గౌరవము సాధించడమగును. కావున మాతోబాటు ప్రపంచమందలి స్త్రీ లోకమంతయు, స్త్రీ స్వాతంత్ర్యాభిలాషులందరును - విండ్సర్ ప్రభ్వి అమెరికన్ అధ్యక్షపదవి కభ్యర్థియై జయము గాంచుగాక యని గాఢముగ నాశింతురని విశ్వసించుచున్నాము.



ఓం

శుభమస్తు　　శ్రీ శారదాంబాయైనమః　　అవిఘ్నమస్తు

# శ్రీ కేసరీకన్యావిద్యాలయప్రారంభోత్సవము

స్వస్తిశ్రీ సర్వధారినామ సం॥ జ్యేష్ట బ॥ తదియా
గురువారం (24-6-1948) నాడు సాయంకాలము 5 గం॥లకు

## శ్రీ శ్రీ శ్రీ విద్యావతీదేవి

విజయనగరం మహారాణీ సాహెబావారిచే
శ్రీ కేసరి కన్యావిద్యాలయ ప్రారంభోత్సవము
విద్యాలయమున కేర్పాటైన " హెర్మిటేజ్ " ( భీమన్న పేట, మైలాపూరు)
అనే భవనమునందు జరుపబడును.
కావున ఎల్లరు విచ్చేయ ప్రార్థితులు.

మద్రాసు
15-6-48

ఇట్లు
కేసరి హైస్కూలు కమిటీ.

# ఈ శకుంతల ఆ శకుంతల

"ఎవరిని చంపడానికి నేను ఉద్దేశించలేదు. ఆహారశాఖా కచేరికివెళ్లి రామన్‌గారు కూర్చున్నగదిలో ఒక్కసారి పిస్తోలు కాల్చాను. రామన్‌గారు నాకుచేసిన అన్యాయమును ప్రపంచమునకు చాటడమే నా ఉద్దేశము. నా కట్టి నిర్ణయమునకు కారణమైన ముఖ్య విషయముల నన్నిటిని ప్రపంచమునకు తెలుపవలయునని నా అభిప్రాయము. నాకువలెనే నాయితర సోదరీమణులకున్నూ ఇట్టి అన్యాయములు జరుగకుండా ఆపు చేయవలయునని నే నిట్లు గావించితినే గాని కసి తీర్చుకోవలయునని నా కోరిక గాదు."

ఢిల్లీనగరంలో సెషన్స్ కోర్టులో శ్రీమతి శకుంతలాకన్య పల్కిన వాక్య రత్నములివి.

ఈమెపై సెషన్స్ జడ్జి గా. యస్. యస్. దులాత్ ప్రాసిక్యూషన్ వాదమువిని - (1) రివాల్వర్ దొంగిలించినది. (2) రివాల్వర్ దగ్గరనుంచుకొన్నది (3) రివాల్వర్‌తో ప్రేల్చి శ్రీ యస్. వి. రామన్‌గారిని చంప యత్నించినది: అనే నేరములు మోపినప్పుడు - ఆమె మొదటి నేరమును చేయలేదనినది, రెండవ నేరమున కంగీకరించినది; మూడవ నేరస్వభావమును వైరీతిగా వివరించినది.

శ్రీమతి శకుంతలాకన్య దాక్షిణాత్య బాలిక, స్వస్థలము బెంగుళూరు. ఎట్లో ఆమెయు ఆమె తల్లియు, - 1000 మైళ్ల దూరాననున్న ఢిల్లీనగరం చేరినారు. ఆమె అక్కడ ఒక కళాశాలలో ఇంటర్‌మీడియేట్ చదువుచున్నది. వయస్సు - 16-17 సం॥ ల మధ్య.

ఆమె ఏప్రిల్ 9' వ తేదిన సాయంకాలము 4 గం॥ లకు ఢిల్లీ ప్రభుత్వ కార్యాలయములో ఆహారశాఖ కార్యాలయానికి వెళ్లినది. శ్రీ యస్. వి. రామన్ అనే మరియొక దాక్షిణాత్య యువకుడు పనిచేయుచున్న చోటికివెళ్లి - చేతిలోనున్న పిస్తోలుతో నొక్కసారి కాల్చినది. అతనికేమియు తగులలేదు. వెంటనే ఆమె అరెస్టు చేయబడినది. ఆమెపై పోలీసులు ఈమూడునేరములు మోపి కేసు చేసిరి. మ్యాజిస్ట్రేటు సెషన్స్ కోర్టుకు కమిట్ చేసినాడు. సెషన్స్ జడ్జిగారు క్రమముగా విచారణసల్పి శిక్షించారు.

సెషన్స్ విచారణకుముందు ఆమెను జామీన్‌పై విడుదల చేయుడని ఆమెతరపున వకీలు వాదించాడు. ఆమెను జామీన్‌పై విడుదలగావించుచో పారిపోవునని కాని, తిరిగి అదే నేరమొనర్చునని గాని భయపడనక్కరలేదు; ఆమె దూరదేశస్థురాలు. ప్రతివాదము నేర్పాటుచేయగలవారు మరెవ్వరూ లేరు-అని ఆమె వకీలువాదన. జడ్జిగారు ఆవాదన నంతావిని "ఆమె యితరులకేకాక తనకున్నూ హాని చేసుకోకుండా చూడవలసిన బాధ్యత కోర్టువారిది" అని పల్కెను.

దానికామె ఉజ్వలముఖియై నిట్లనినది:

"ఆత్మహత్య చేసుకొందామనే ఉద్దేశం నాకు లేదు. బ్రతికియుండి నా కర్మ మెట్లా కాలిందో లోకానికి వెల్లడింతమని నా ఆత్రము."

విచారణావసరమున సాక్ష్యులు చెప్పినదానిని పట్టి తెలియవచ్చిన హంశములు:-

ఆమె అచ్చట మరొక పెద్ద ఉద్యోగియైన శ్రీ పి. యం. సుందరంగారిని కలుసుకొని తనతో చెలిమిచేసిన - రామన్ గారిని తన్ను వివాహమొనర్చు కొనునట్లు ప్రోత్సహింపుమని కోరియుండెను. రామన్ తన్ను మిక్కిలిగా ప్రేమించెననియు, పెండ్లాడుదునని వాగ్దత్తమొనర్చెననియు ఆమె ఆయనతో చెప్పియుండెను. అందుకతను రామన్‌ను అట్లుప్రోత్సహింప జాలననియు, ఆమె తీవ్రముగా దలంచుచో కోర్టుకెక్కుట మంచిదనియు చెప్పెనట.

రామచంద్ర భాటియా పోలీసు ఇన్‌స్పెక్టరు. అంతకు ముందొకసారి-ఆమె రెండు కాగితములతో ఆయనను చూచినదట. అందొకటి రామన్ వల్ల తనకు (శకుంతలకు) ప్రమాదము జరుగనున్నదని ఫిర్యాదు, రెండవది - శ్రీ ప్రతమ్ సింగు తానామెకు సంరక్షకుడను అని వ్రాసి యిచ్చినది. దానిపై ఆ ఇన్‌స్పెక్టరు విచారణసల్పి-ఫిర్యాది భయమున కాధారము లేదన్నారు. ఉభయులు ఒక పెద్ద చెప్పినట్లు వింటే మంచి దన్నారు. ముందు సి. కె. నాయర్ అనే ఆయనను పరిష్కర్తగా అంగీకరించినారు, తుదకు రాయిసాహెబ్‌గారు నిర్ణయించిన తీర్పు వప్పుకుంటామన్నారు. అట్లావారు రాజీపడుదురని తెలిసి విచారణ ఆపుచేయ బడ్డది.

ఆమె వద్దనుండిన రివాల్వర్ శ్రీ ప్రతమ్‌సింగు గారిది. చీఫ్ ఇంజనీర్ ఆఫీసులో అసిస్టెంట్ ఆయన. ఆయనయే ఆమె గార్డియనును అన్నది. ఆయన తన రివాల్వరును ఆమె దొంగిలించినది అన్నాడు. అయితే, సైకిలు కంటగట్టిన బుట్టలోనుండగా దొంగిలినదని యొక్కసారి; గోడన వంకెకు తగిలించి యుంటే - అని మరొకసారి అన్నాడు. శకుంతల మాత్రము తానా రివాల్వరును దొంగిలించలేదనియు ఎవ్వరికి హానిచేయనని నమ్మపల్కి - సింగుభార్య వద్దనే ఎరువు తెచ్చితిననియు చెప్పినది.

కథానాయకుడు శ్రీ యస్. వి. రామన్ గారు చెప్పిన సాక్ష్యము:—గత ఫిబ్రవరిలో తమిళసంఘం వారు సత్యమూర్తి స్మారకనిధికని ఒక నాటకం వేశారు. అందు అతడే కథానాయకుడు. సభకార్యదర్శి రామమూర్తిగారు శకుంతలను నాయికా పాత్రధారిణిగా గైకోమని శిఫారసుచేశారు. ఒక వారం రిహార్సిల్స్ అయిన మీదట-ఆమె పనికిరాదని-మరొక పురుషునకే ఆ వేషము నిచ్చారు. తమ యిరువురి మధ్య ఎలాంటి చెలిమిగాని, చనువుగాని - ఏర్పడనేలేదు. అయితే ఒక నాటి రాత్రి శకుంతల తన గదిలో నిద్రపోయినది. కాని తానా రాత్రి తన గదిలో నిద్రించలేదు. ఈ నేరం జరిగే దానికి ముందు రోజున శకుంతల చెలికత్తె యొకతెవచ్చి మీరుభయులు ప్రేమానురాగ బద్ధులగుచో ఏల వివాహము గావించుకొనిరని తన్ను అడిగెను. నేరస్థురాలితో తన కట్టి సంబంధ బాంధవ్యము లేమియు లేవని రూఢిగ బదులు చెప్పెను.

విచారణ అంతయు అయిన మీదట న్యాయాధిపతి (1) రివాల్వరు దొంగిలించెననే నేరమును త్రోసివైచెను. (2) రివాల్వర్ లైసెన్సు లేకుండా కలిగి యుండెనను నేరమును నిర్ణయించెను. (శకుంతలయూ అంగీకరించెను.) (3) రామన్‌ను చంపుటకు ప్రయత్నించెనన్న నేరమును-సమ్మతింపక - కేవల మతనిని ఘాతపరుప యత్నించెననియే-నిర్ణయించి-నేరస్వభావమును మార్చెను.

రివాల్వర్‌ను లైసెన్సు లేకుండా కలిగియున్నందులకు కోర్టు లేచువరకు జడ్జిగారు శిక్షించినారు.

రామన్‌గారిని ఘాత పరుప యత్నించినందున 1 సం|| ము "సత్ప్రవర్తన" కై జామీను నిమ్మని కోరినారు.

శ్రీమతి మృదులాబెన్ శారాభాయి కన్య-ఆమె సత్ప్రవర్తనకు జామీను నిచ్చెను. మృదులాబెన్ కన్య కోటీశ్వరుడగు శారాభాయి కుమార్తె; పలు

తడవలు సత్యాగ్రహ మొనర్చిన గాంధీ శిష్య, కస్తూరిభాయి గాంధీ స్మారకనిధి కమిటీకి ప్రథమ కార్యదర్శి, కొన్నాళ్లు అ. భా. కాంగ్రెసు కమిటీ ప్రధానకార్యదర్శి, అన్నిటికిమించి భారతయూనియన్ ప్రధాని శ్రీ జవహరిలాలు నెహ్రూ పండితుని మదికెక్కి మున్ననగన్న సుశీల.

లా గ్రుడ్డిది; దానిపని అదిచేసినది. అయితే- ఒక పురుషుడు తనతో చెలిమిచేసి అన్యాయ మొనర్చినన్న ఆగ్రహాతిరేకమున 1948 సం॥న ఒక విద్యావతియగు యువతి-తన అన్యాయమును లోకమునకు వెల్లడింప నాశ్రయించిన నాగరికమగు ఉపాయమిదియని-ప్రపంచమునకు స్పష్టమైనది.

♦ ♦ ♦

ఇదే ఢిల్లీ నగరంలో-హస్తినాపురంలో - ఒకనాడు కణ్వపోషిత శకుంతల భర్తృపరిత్యక్తయై, ఆభర్త చక్రవర్తియనియైనచూడక ఆతనిని వాగ్బాణములతో నొప్పించినది.

రాజర్షి అప్సరసలు తలిదండ్రులైనా-పుట్టీ పుట్టక ముందే వారిచే పరిత్యక్త. పక్షులు కరుణయా తేనె చిలికి ప్రాణం కాపాడినవి. ఆ జన్మ బ్రహ్మచారి కణ్వుడు మనసు మెత్తబడి తీసుకొని వెళ్లి ఆశ్రమంలో పెంచి పెద్దదాన్ని చేశాడు. ఛాంధసులైన వటువులతో, అమాయికలైన తాపసి కన్యలతో, నిరంతర వ్రత పరాయణలైన వృద్ధతాపసి స్త్రీలచే సుపలాలితయై, ఆరణ్యకములైనా మనిషి మచ్చికగల, నెమలి, జింక మొదలైన మృగముల, పక్షుల మధ్య పెరిగినది. అలాంటి సామాన్య పరిస్థితులలోనున్న తన జీవితాకాశంలో హఠాత్తుగా తటిల్లతవలె కన్పించి దుష్యంత చక్రవర్తి, సుందరమైన, సున్నితమైన ఆకారము, మనస్సు, మాటలతో-దిగ్భ్రమగొల్పి అనురాగం చూరగొన్నాడు, సిగ్గు దోచుకొన్నాడు. తన ముద్దు టుంగరం వ్రేలతొడిగి "ఆ అక్షరాలు రోజుకొకటి లెక్క పెట్టుకో. ముగిసేటప్పటికి మా పరిజనంవచ్చినిన్ను మాయింటికి పిలుచుకొని వస్తారు" అని నమ్మ పల్కి వెళ్లాడు.

పెంపుడు తండ్రివచ్చి - జరిగిన పనికి సంతోషించాడు, చక్రవర్తిని కనబోతున్నావని ఆశీర్వదించాడు. కాని ధర్మశాస్త్ర విధ్యుక్తముగా వెంటనే భర్తృగృహానికి ప్రయాణ సన్నాహం చేశాడు. పెంపుడు కూతురు విడిచిపోతున్నదని చింతించాడే గాని-తిరిగీ ఆశ్రమానికి ఎప్పుడు రమ్మంటావు అన్నప్పుడు "కొడుకునకు రాజ్యమప్పగించి భార్యాభర్తలు వానప్రస్థులై అరణ్యవాసం చేతురు"గాని అని కఠినంగానే చెప్పాడు. "తాతను విడిచి ఎలా ఉండేది" అని అంగలారిస్తే-"పిచ్చిదానా! గృహలక్ష్మివై ఆ కార్యాకలాపాలలో పాతబడేసరికి ఈ వియోగమూ పాతబడుతుంది" అని తేర్చేశాడు.

హస్తినాపురంలో, క్రొత్తఆశలతో, ఆశయాలతో, - శకుంతల, ఆశ్రమవాసుల వెంట రాజద్వారం ప్రవేశించినది, రాజసన్నధికి వచ్చినది. రాజు ఉలకలేదు, పలకలేదు. శకుంతల కది సంశయాస్పదమైనది. కణ్వశిష్యులు- "నిజదుహితను నీచే గాంధర్వ వివాహితను, ఆపన్నసత్వను, స్వీకరింపుము" అని కణ్వసందేశము వినిపింపగా - "ఏమిటీ ఉపన్యాసం" అని రాజన్నాడు. శకుంతలకది నిప్పులు విసరినట్లైనది. రాజు ఋషిశిష్యులవల్ల, తిరిగి వివరములువిని - "ఏమీ మేమీమెను వివాహమాడితిమా?" అని ఆశ్చర్యము వెలిబుచ్చినాడు. శకుంతల తన సంశయము పేరుకొనుచున్నదని దిగులొందినది. మునిశిష్యులు రాజును దూషించినారు. లాభములేక పోయినది.

వెంటవచ్చిన వృద్ధతాపసి, ఆర్యగౌతమి- మరొక ఉపాయ మూహించి, శకుంతల మేలిముసుగను తొలిగించి, పోల్చుకోమన్నది. రాజునకు శక్యము కాలేదు. శిష్యులు నిర్మొగమాటముగా ప్రశ్నించుచున్నారు. రాజు "గర్భవతిని, పూర్వపరిచయ మేమాత్రమును స్ఫురింపనిదే, ఎట్లుగైకొ"నన్నాడు. శకుంతలకింకను-దుష్యంతునియందు మార్దవభావము తొలగలేదు. "ఆర్యపుత్రునకు పరిణయమునందే సందేహమే, ఏమి నాగతి?" అని అపవారించి శిష్యుల ప్రశ్నించినది. ఆ ఛాందసులలోనొకడు రాజును శకుంతలను నిందించినాడు. వేరొకడు అతనినివారించి-ఆమెతో "రాజును ఏమి చెప్పుకుంటావో, చెప్పుకో!" అన్నాడు.

ఇక కణ్వాశ్రమమున రహస్య సంభవమును ఆనవాళ్లుచెప్పి ఋజువుపరచుకోవలసి వచ్చినది, ఇక్కడ

ముగ్ధాయియే న్యాయాధీశుడును. అయినను విధిలేదు. అరణ్యక - అమాయకపు మూర్తి - ఏమిచెప్పను, ధర్మశాసనాసీనుడైయున్న పౌరవ చక్రవర్తి నెట్లు నప్పించగలదు? అయినను ముగ్ధ యోగ్యమైనభంగి "ఆర్య పుత్ర" అని సంబోధించినది- "పరిణయమును సందేహించు వాని నట్లు సంబోధింపనేల?" యని "పౌరవా!" యని తిరిగి సంబోధించినది. అది ధీరాధీర లక్షణము.

"పూర్వ మాశ్రమమున స్వభావముచేతనే ముగ్ధ హృదయనైన నన్ను నమ్మించి, స్వీకరించి ఈ విధమైనరూక్షణాక్షరముల నేడు తిరస్కరిస్తున్నావా?" అని ప్రశ్నించినది; ఎంతబేల! రాజు రెండు చెవులు మూసుకొని "శాంతం పాపం" అన్నాడు. ఇక గత్యంతరమేమి? ఆఁ! అంగుళీయకం జ్ఞప్తికి వచ్చినది. నిజముగ పరమార్థతః శంకించుచున్నాడని ఆ గుర్తు చూపింపదలచినది. రాజును "మంచిది" అన్నాడు. అయ్యో! వ్రేల నా యుంగరము లేదు. విషాదముతో గౌతమితట్టు చూచినది. ఆమె ఆ యుంగరము చక్రతీర్థమున జారియుండునని వెంటనే సమాధానము చెప్పినది. ధర్మాసనస్థుడు, చక్రవర్తి, నిత్యమిట్టి వ్యాజ్యముల నితరుల నెన్నో విచారించి పరిష్కరించు చుండును. "స్త్రీలు, సద్యస్ఫురణముతో సాకులు చెప్పగల నేర్పరులు" అని చిరునగవుతో-అన్నాడు. అందు తాను ముద్దయినన్న మాట మరచినాడు కాబోలు! శకుంతల కేమియు పాలుపోలేదు. విధి వ్యతిరిక్తమైనదని వినుగుకొన్నది. అయినను ఒకటి రెండు రహస్య సంఘటనములు చెప్పి యొప్పింతమని ఆశ. "విన్నాముగా!" అని రాజు ఈసడించినాడు. అయినను, శకుంతల నాశ విడువలేదు.

"ఒక రోజున నవమాలికా మండపంలో నళినీపత్రభాజనమందు ఉదకముంచి పట్టుకొని ఉంటిరే!" అని పూర్వస్మృతి మాధుర్య ముట్టిపడ ఆమె గాథ ప్రారంభించినది. అతడు వినుకలో-

"ఆ కానీ; కథ!" అన్నాడు. వింటున్నాడనే ఆశతో ఇంకా ఇట్లా చెప్పింది,

"అప్పుడు నా పెంపుడుజింక, దీర్ఘాపాంగమనే పేరిటిది, మనవద్దకు వచ్చినది. మీరు కరుణామయులై దానికానీరు త్రాగమని అందించబోయారు. అది పరిచయంలేక మీవద్దకురాలేదు. తర్వాత నేను ఆ దొన్నె తీసుకొని ఆనీటినే దానికందివ్వగా త్రాగినది. అప్పుడుమీరు నవ్వుతూ ఇట్లా అన్నారు. 'అందరు తమజట్టువారినే విశ్వసిస్తారు; ఇద్దరూ ఆరణ్యకులే కదా!' అని"

ఆమె చిత్రించినది, వర్ణించినది మనోహర దృశ్యము, రసవత్తరఘట్టము. ఆ కడపటి దుష్యంత వచనములో అమృతము నింపినాడు, కాళిదాసు. 'ఇద్దరూ ఏక జట్టుకు చెందినవారట' ఆ జింకపేరు దీర్ఘాపాంగమట. అది శకుంతల సౌందర్యమునకు కిరీటము - అయితే ఈ ఆనవాలు, ఎవరికీ? ఇందుకు తా ముభయులుగాక మరిసాక్ష్యములు - తామరాకు దొన్నె, జింకపిల్ల!

ఈ కథనమున్నూ - ఆతనికి చేదైనది. "కార్యసాధన కుశలలైన యువతుల తియ్యని కల్లబొల్లి కథలకు - విషయలోలురు ఆకర్షింపబడతారులే!" అని దెప్పి పొడిచాడు.

అంతవరకూ వూరుకున్న ముసలితాపసికి ఉలుకు వచ్చినది: "తపోవనాల్లో పెరిగినవారికి ఈలాంటి అబద్ధాలు చేతగావు" అని మారు చెప్పినది.

రాజునకూ కొంచెము కోపమువచ్చినది. "మనుష్యేతరమైన స్త్రీజాతికే వంచకత్వము తెలుసు; ఇక మాటామంతి తెలిసిన మనుష్యుల సంగతిచెప్పాలా!" అని అధిక్షేపించాడు. "పరభృతముల." ను (కోకిలలు) పామ్యము చూపాడు. శకుంతల కిక ఆగ్రహం నిల్చిందికాదు, ఆశాతంతువు పూర్తిగా తెగిపోతున్నది. పైగా ఆపన్నసత్వయైన తన్ను పరభృతమునకు అన్యాపదేశముగా సరిపోల్చి నిందించాడు. తన సతీత్వమునే శంకించినాడు.

"అనార్యా" అని సంబోధించినది. "నీవు దుష్టుడవు. అందరిని దుష్టులని భావించుచున్నావు. గడ్డికప్పిన నూతివి; ధర్మ కంచుకం తొడుక్కొన్న దొంగవు." అని నోరార దూషించినది.

అంతవరకు "ఆర్యపుత్ర!" యని మన్నించినది; పరిణయమును సంశయించుచున్నవానికి ఆ సంబోధనమే లయని "పౌరవా!" యని పిల్చినది. తుదకు తనశీలమునే నిందించినవాడని - "అనార్య" అని దూషించినది. ఇది కాళిదాసుప్రయోగము. "ఆర్య" శబ్దము చాల పవిత్రమైది, సకల సద్గుణములకు మూలమది. జాతినిరూపకము. అందును పౌరవ వంశ సంజాతుడైన దుష్యంతచక్రవర్తిని "అనార్య" అని అధిక్షేపించుటకన్న-శిరచ్ఛేదనము మేలవము. అదియు ధర్మపత్నియా అనుట? హిందూ ధర్మపత్ని భర్త ఏమి చేసినను సహించవలసినగంగిగోవు కదా! కవులు లోకమర్యాదల, సత్సాంప్రదాయముల రక్షింపవలసినవారు. కాళిదాసునకెనయైనవాడు భవభూతి మహాకవి, "సమకాలికులు మెచ్చకున్నను,- ఈ విశాల ప్రపంచంలో, భవిష్యత్కాలంలో ఎవరైనా మెచ్చుకోరా" అనే ధీమసంతో కావ్యములల్లిన కవి, - లోకులప్రీతికై శ్రీరాముడు సీతను అడవిని విడువగా_ఆమెనోట "నా హృదయమాయన కెరుక; ఆయనహృదయము నాకెరుక" అని చెప్పించినాడేగాని - ఒక్క పరుష వాక్యమైన పలికింప సాహసింపలేదు. కడకు కంకంటి పాపరాజు పాటి సాహసమైన గావింపజాలడయ్యె. అయితే - కాళిదాసు - కావ్యప్రపంచమున కాళిదాసొక్కడే - ఆనాటి కాసాహసవచనము రూపింప గల్గినవాడు.

రాజును కేవలము మూఢుడుగాడు, ఆయన విస్మృతియు వేషముకాదు. కాళిదాసు అందుకొక శాపము కల్పించి యున్నాడు. ప్రథమమునుండియు అతని మనస్సు ద్వైదీభావముగనేయున్నది. గౌతమి మేలి ముసుగుతీసిచూడుమనగానే - సంశయము వృద్ధియైనది. విడిచిపెట్ట జాలకున్నాను; స్వీకరింప జాలకున్నానే అనకొన్నాడు. ఉంగరం చూపుతానన్నప్పుడు-ముఖ్యమైన సాక్ష్యమని పల్కి న్యాయమెరుంగ తన ఆత్రము చూపినాడు. ఉంగరము పోయినదనిచెప్ప, మరేవో కథలు చెప్పి నమ్మింప బోవు సరికి-అతనికి వెక్కసమైనది. సంశయ గ్రంథి మరింత చిక్కుబడినది. ఒక్క పొరబాటు మాటకూడ (పరభృత సామ్యము) జారినది. దానితో శకుంతల దెబ్బదిన్న ఆడుపులియై విజృంభించినది. ఆగ్రహించు ఆమె విగ్రహమును పరికించునాడు.

"ఆమె కోపము - తాను అబద్ధమాడుటలేదని కన్పించి, నన్ను మరియు సంశయగ్రస్తు నొనర్చుచున్నదే" యని వితర్కించినాడు. ఇంతవరకు మర్యాదగ పల్కిన ఆమె ఇప్పుడు "అనార్య" అని సంబోధించి దూషణల కారంభించినది. తాను నిజముగా రహస్య ప్రణయమొనర్చి మరచిన వాడనై యున్నట్లైతే - ఆమె కోపము - అనేక విధముల ఆ రహస్య వృత్తమును నా స్ఫురణకు తేయత్నించి విఫలమైన ఆమె కోపము-వంకలు తిరిగిన కనుబొమలు విరుచుచు వెలిబుచ్చుచున్న ఆమె కోపము-అవ్యాజమున-మన్మథ శరాసనమును విరిచివేయుచున్నదా? అనియు వితర్కించినాడు. ఆ ఒక్క పదముతో అతనికి - ప్రాయము విస్మృతమైనచో - భగ్నము అయిపోవుచున్నదే అన్న ఆత్రము పుట్టినది. అదీ ఆ (నాటి) శకుంతల, భర్తృపరిత్యక్తయై, అతని బోధింప యత్నించి - విఫలయై-లోకమునకు తన గోడు విన్పింప ఆశ్రయించిన నాగరిక పద్ధతి.

[దుష్యంతుడట్లు వితర్కించి-దుష్యంతుని శీలము ప్రకటితమే, అని హెచ్చరించి-నాయది విస్మృతియే యైన-అది సత్యము సుమా అని సూచించినాడు. దానికామె అట్లని నన్ను "స్వైరిణి యందువా" యని పరిదేవన మొనర్చినది. పిదప గురు శిష్యులు నీకర్మమనివిడిచినారు. ప్రసవపర్యంతము ఆమె రాజగుర్వాధీనమున నుంచబడినది. ఇంటికిపోవు దారి మధ్యలో అప్సరస లామెను ఆకసమునకు గొంపోయిరి.]



# ఈ రెండు క్రీములు ఎందుకు మీ ముఖమును మరింత లావణ్యముగా చేయును.




మీ ముఖమును పరిశుభ్రము చేయుటకు పాండ్స్ కోల్డ్ క్రీమును వాడండి. ప్రతి రాత్రి మీ ముఖమునకు కంఠమునకు ఈ క్రీమును రాయండి. దీనిలోని తైలములు చర్మరంధ్రములలో ప్రవేశించి చెమటవల్ల ఏర్పడిన మాలిన్యమును తొలగించును. తరువాత తుడిచివేసి అద్దములో మీ ముఖమును చూచుకొనండి. మీ వదనము ఎంత తేజోవంతముగాను, మృదువుగాను ఉన్నది!

మీ సౌందర్య రక్షణకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును వాడండి. జిగటుగా అంటుకొనని ఈ క్రీమ్ రాయగానే అదృశ్యమైపోవును. మెరుగుయుండదు కాని పుష్పసదృశమైన మృదుత్వము కల్గును. ఈ క్రీమ్ పొర అదృశ్యముగానుండి ఎండ, దుమ్ము, తగులకుండా మీ సౌందర్యమును రోజంతయు కాపాడును.

స్త్రీ సౌందర్యమునకు రెండు క్రీములు అవసరము. మొదటిది — పరిశుభ్రతయే సౌందర్యమునకు ప్రధమసూత్రము కావున—మీ ముఖమును పరిశుభ్రపరచి, మృదువుగా నుంచుటకు చక్కని నూనెలతో మిళితమైన ఒక క్రీమ్: పాండ్స్ కోల్డ్ క్రీమ్. రెండవది—వేడిమి దుమ్ము నుండి కాపాడుటకు, నూనెలు లేనిది మరియు అదృశ్యమై పోవునట్టి—పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్.





జాగ్రత్తయుంచుకొనుడు — మాడ్చివేయునట్టి ఎండా కాలపుటెండవలన, శీతాకాలపుచలి వలనను, చర్మమందలి స్వాభావికతైలములు ఎండిపోయి చర్మము బిరుసుగాను, నల్లగాను ఉండును.



ఇంకనూ జాగ్రత్తయుంచుకొనుడు — చర్మగ్రంథులలోనికి లోతుగా పోయిన దుమ్ము, మాలిన్యపు కణములే చాల వరకు చర్మవైరూప్యములకు కారణములగుచున్నవి.



ప్రతి రోజూ పాండ్స్‌వారి రెండు క్రీములను వాడినచో ముఖము మృదువుగాను, తేజోవంతముగాను, లోపరహితముగానుయుండి, ఎల్లప్పుడు యౌవనవంతముగానే యగుపడును. ఈ రెండు క్రీములతో మీ ముఖమునకు ‘‘ సౌందర్యక్రమ శిక్షణ ’’ యొసగుడు—నిత్యము.

## పాండ్స్

వ్యాపార వివరములకు: యల్. డి. సేమూర్ & కం., (ఇండియా) లిమిటెడ్.
బొంబాయి — కలకత్తా — ఢిల్లీ — మద్రాను — నోవా గోవా — కరాచి.
కొలంబో - రంగూన్




అబ్బా!......తలంచుకుంటే గుండెలు పగిలిపోతున్నై. ఆ భయంకర కాళరాత్రిలో, అంధకారబంధురంలో, చీకటి కెరటాల అల్లకల్లోలనిబిడనిర్జనభయదశ్మశానవాటికలో...పూడ్చబడ్డ శవాన్ని పైకితీశారు......నిశ్శబ్దం తాండవిస్తోంది...ఆ దురాగతాన్ని తిలకించిన తీతువు రహస్యాన్ని బయటపెడుతానని మూలుగుతోంది.

కరణంగారే...మెడలో రుద్రాక్షమాలిక గూడావుంది...ఆ శవాన్ని ముట్టుకుని యెడమచేతి బొటనవ్రేలిని పత్రంపై ముద్రవేయుంచుకున్నారు..

ఎంతద్రోహం...ఆ గ్రామం శిథిలంకావడాని కితడే ప్రబలకారకుడు. సాహుకారు దౌర్జన్యానికి అనుకూల వాతావరణాన్ని, సృష్టించి, విరిగిపోని వ్యూహాలను నిర్మించియిచ్చిన కుటిలమేధావి.

కామయ్య పదియెకరాల పొలంతో, పాడిసంపదలతో, పుత్రకళత్రలతో బాగానే బ్రతికాడు. కాలచక్రగమనవేగంలో పక్షవాత శాపంతో మృత్యుముఖంలో కన్నీటి కెరటాల్ని చిలికించి జీవితాన్ని చాలించాడు. పచ్చగా నిత్యకల్యాణంతో చాలినంత సంపదతో హాయిగా కాలాన్ని నెట్టుకొంటున్న కామయ్య కుటుంబాన్నిచూచి సాహుకారు ఓర్వలేకపోయాడు. ప్రబల ప్రయత్నాలతో కుతంత్ర సాధనలతో కపట విశ్వాసాలతో లొంగని కామయ్యకోసం కాచుక్కూచున్న సాహుకారుకావాడే అపూర్వ తరుణం లభించింది..

కామయ్య సంపదను హస్తగతం చేసుకోడానికే కరణంగారితో ఆలోచించి తీర్మానించుకున్న కార్యక్రమానికి తొలిచర్య శ్మశానంలో జరిగింది. కామయ్య యావదాస్తిని సాహుకారుకు విక్రయం చేసినట్టు వ్రాసిన పత్రంలోనే కామయ్యశవాన్ని పైకితీసి యెడమచేతి బొటనవ్రేలి ముద్రను వేయించుకున్నారు.

కామయ్య కుటుంబంలో విషాదం మకాంవేసింది. కన్నీటి స్రవంతులు సాగినై. వేడి నిట్టూర్పుల పిండులు వెలువడినై...శాస్త్రరీత్యా ఉత్తరక్రియలు జరగడం, కామయ్య గృహిణి మంగళాన్ని చెరిపివేయడం నిరాటంకంగా సాగిపోయినై..

హటాత్తుగా గ్రామంలో పెద్ద కలవరం బయలుదేరింది. పోలీసులు...సర్కారుమనుష్యులు కామయ్య కుటుంబాన్ని ఇల్లు ఖాళీచేయమంటున్నారనే వార్త విద్యుల్లతలా వ్యాపించింది.

సాహుకారు భవనంలో కోలాహలం, అట్టహాసం, కామయ్య గృహంలో ఆందోళన, ఒక్కపెట్టున విజృంభించినవి...

సాహుకారుభవనంలో వేడివేడి పులావులు, కాఫీలు, ఫలహారాలు, ఉపాహారాలు జోరుగా సాగిపోగా కామయ్య గృహంలో ఆకలి; ఆవేదన, దాహం, నిరాశ, నిస్పృహలు విపరీతమైనై...

సాయంకాలం ఆరుగంటలకల్లా సాహుకారు యింటిముందు నిలిచియుండిన మోటారుకారు వెళ్లిపోయింది...గ్రామవాసుల్లో గుసగుసలుమాత్రం యథేచ్ఛగా సాగిపోతూన్నై...

రాత్రి ఎనిమిదిగంటకు దేవుడిగుడివద్ద పంచాయతీ జరిగింది....దేవునియెదుట కామయ్య మూడువేలరూపాయలు తీసుకున్నది పరమ సత్యమని సాహుకారు చెప్పాడు..

కామయ్యభార్య కాంతమ్మ నాకేపాపంతెలియదని చెప్పుకుంది..సాహుకారు పంటపండింది. కాంతమ్మ కాపురముండడానికి యిల్లునుమాత్రం విడచిపెట్టి మిగిలిన పొలాలను సాహుకారు, స్వాధీనం చేసుకోడం న్యాయమని తీర్మానించబడింది...

# తొలి బలి

కాంతమ్మ గుండెల్లో ఆరిపోని అగ్నిశిఖలు అంకురించి ఆమె శరీరమంతా జ్వాలామాలికల తోరణాలతో నిండిపోయింది. వేడికన్నీటి తరగల్లో పూర్తిగా స్నానంచేసింది...

సత్యం అపజయం తోకముడుచుకుంది. గుడిలోని దేవునిలో చలనంలేదు. కాంతమ్మ కన్నీటిని తిలకించిన చంద్రుడు నవ్వుతూనే వున్నాడు. చుక్కలు వెలుగుతూనే వున్నై.

సాహుకారు దౌర్జన్యపద ఘట్టనంలో కాంతమ్మ జీవితం నవసిపోవడానికి నాందీప్రస్తావన జరిగింది.

కాంతమ్మ చేతిలో కూలికొడవలి తాండవంచేసింది. నిప్పులుకురిసే యెండలో శరీరం చిట్లిపోతున్నా పనిచేయడానికి ఆరంభించింది.

కామయ్య పొలాలను సాహుకారు సాగుచేస్తున్నాడు. అదేపొలంలో వేలడబ్బుల్ని గడించాడు.

ఓనాడు సాహుకారు కాంతమ్మను కూలికిపిలిచాడు. కడుపు కక్కుర్తికోసం వెళ్లింది. కామయ్య స్వంతపొలంలోనే కాంతమ్మ కూలిదైంది...ఆదినమంతా ఆమెహృదయం కుమిలిపోయింది. ఆమెముఖంలో వున్న విషాదాన్ని గుర్తించిన కూలిపడుచు ఓదార్చింది.

సాయంకాలం యింటికివెళ్లి పడుకుంది కానీ ఆమె మనోలోకంలో ఆవేదనాతరంగాల కల్లోలం రేకెత్తింది...కలతనిద్దరలో చిన్నపాపల్ని కౌగలించుకుని పడుకుంది...

ఇంతలో సాహుకారు రమ్మంటున్నాడనే పిలుపు వినబడింది...సంశయహృదయంతోనే వెళ్లింది..

సాహుకారు వసారాలో చుట్టకాల్చుకుంటున్నాడు.

"కాం తా"

"....."

"విన బడ ం లే దూ"

"ఏమండీ?"

"రేపు యిల్లు కాళీ చెయ్యాలి"

ఆమె నిలువునా కూలిపోయింది. కాళ్లు చేతులు వణికిపోతున్నై...

"ఏం చెబుతావ్?"

"నే నెక్కడికెళ్లడం?"

"సత్రంలోకి"

"మీకీన్యాయం సరిపోతుందా?"

"ఛీ.. గాడిదా.. వాగుతున్నావ్.. యిప్పుడే కాళీచేయాలి."

కాంతమ్మ కిక్కురమనకుండా తిరుక్కుంది.

ఉదయం సాహుకారుబంట్లు కాంతమ్మను బిడ్డల్ని యీవలకీడ్చి యింటికి తాళంవేశారు.

గత్యంతరంలేక ఆ అభాగిని ఆ దగ్గిరపట్టణానికెళ్లి చిన్న అంగడిపెట్టుకుంది. ఈనాడామె ముసలిది. కొడుకులిద్దరిలో ఒకడు మిలిటరీలో చేరిపోయాడు. ఇంకొకడు మిల్లులో పనిచేస్తున్నాడు..

ఆ సాహుకారు భవనానికిప్రక్క శిథిలమై మొండిగోడలతో ఈనాడు కామయ్య గృహం కళావిహీనంగావుంది.. ఆవీధిలోకనబడే శిథిలగృహాలన్నీ సాహుకారు దుండగాలకు కూలిపోయినవే.. కామయ్య కుటుంబం.. సంపద.. సాహుకారు దురాగతానికి, నిరంకుశానికి యిద్దరు పసినిసుగులను పెంచడానికి తొలిబలి గావింపబడింది.

కే. సభా

# జయపురం ఏజన్సీ ప్రాంతం

ఇక్కడ సంతలు విస్తారం; ఆ సంతలలోనే బేరసారాలు సాగుతవి



పెట్ట అనే సంత.
దుడుమా ప్రాజెక్టుకుపోయే
త్రోవలో.



కుందిలి సంతవద్ద జనం.



[మిస్నాజోలి (యాత్రాస్థలం)
శివరాత్రికి కూడినజనం.
[ఇక్కడ ఊరు ఏమీలేదు. 3 ఏళ్లు
ఇక్కడ కలుస్తాయి. వాటిపేర్లు
'ఘోళపోళియా' 'చావల్ ఘువ'
'వంశధార'





గదబ స్త్రీలు

నవరంగపురం సంతలో ఒక కొండపడుచు. (విజయనగరంనుంచి శ్రీ సీతారాంగారంపిన ఛాయాచిత్రాలు)



## శ్రీమతి మద్దుల రాజేశ్వరమ్మగారు కళావంతుల సంఘసంస్కరణ సంఘ కార్యదర్శి : విశాఖపట్టణము

ఈమె విశాఖజిల్లాలో కళావంతుల సంఘసంస్కరణమునకు శక్తివంచన లేకుండా అనేక సంవత్సరములనుండి పాటుపడుచున్నది. ఈ సంవత్సరమున తిరిగి ఈమె విశాఖపట్నం సంఘమునకు కార్యదర్శిగ ఎన్నుకొనబడినది. మహిళాసంఘమున సభ్యురాలుగ ఉండి మహిళోద్యమమున సేవచేయుచున్నది. పాకీపనివారి సమ్మె సందర్భములో ఈమె తన సంఘీయులతో వచ్చి కాంగ్రెస్ వారితో కలిసిచేసిన సేవ ప్రశంసనీయమైనది.

పురిపండా.

---

## గతమాస చిత్రప్రశ్నలకు సమాధానములు.

1వ దానికి:- 1. లోభము వదలినవాడు 2. దేవాతిథి పితృసేవకాదులకుఁ బెట్టక తినువాఁడు 3. దేవాతిథి పితృసేవకాదులకు బెట్టి తినినవాడు. 4. సుకర్మము 5. స్వార్థము 6. క్రోధము వదలినచో 7. తృష్ణను వదలినచో 8. గర్వము లేకుండునట్టివాఁడు 9. సత్పురుషులు 10. సత్యము 11. నిదానము 12 జనని.

2 వదానికి:- నలుఁడు_నకులుఁడు_ఇనకులుఁడు

# (( స్త్రీలు నేర్వవలసిన విషయములు ))

ఉభయభాషా ప్రవీణ, హిందీరాష్ట్ర విశారద శ్రీమతి వి. హేమలతగారు.



స్త్రీలు శిశుపోషణ, గృహనిర్వహణ, పవిత్రప్రేమ, కళాపిపాస మున్నగువిషయములను ముఖ్యముగ నేర్వవలయును ఇవన్నియు నెఱింగిన స్త్రీయే గృహలక్ష్మియని అనుపించుకొనును.

ప్రస్తుతము నారీమణులు, పాశ్చాత్యవిద్యల వ్యామోహమున నిమగ్నులై, స్వధర్మములను విడచిపెట్టు చున్నారు. దేశకాలపరిస్థితులనుబట్టి యావిద్యల నేర్చినను, ప్రాచీనహిందూవిద్యలను, పునరుద్ధరించి, వారి సాంప్రదాయముల ననుకరించుటయుక్తము. ఇందువలన ముక్తియు, భుక్తియుఁగూడకలవు.

మఱియు దేశసౌభాగ్యముఁగోరినచో, స్త్రీ పురుషులిరువురును బండిచక్రములవలె కలిసి పనిచేయ వలయును. అందులోనెవరు హెచ్చుతగ్గులుగనున్నను యాపనిఫలవంతముకాదు. ఫలవంతముచేయవలెనన్నచో స్త్రీ పురుషులిరువురును వివేకవతులగు టత్యవసరము.

వేదకాలమునాటి స్త్రీలుకూడ విద్యనభ్యసించి, కవయిత్రులుగను, వీరమాతలుగను, పేర్వడసిరి. సీత వివేకవతియై భర్తతోపాటు సభలయందు గౌరవమునందినది. మొల్లవిద్యనభ్యసించి, రామాయణముఅను పుస్తకమువ్రాసి, శాశ్వతకీర్తి గడించినది. సత్యభామ భర్తతో రణరంగమునకేగి యుద్ధముచేసి శత్రుసంహారము కావించినది. జీజాభాయి వీరమాతయై తన కొమారుఁడగు శివాజీని గొప్పవీరునిగ తయారుచేసినది. కాన స్త్రీలభ్యసింపకూడని విద్యలులేవు. "ముదితల్ నేర్వగ రానివిద్యకలదే ముద్దార నేర్పించినన్" అని పెద్దలు చెప్పినట్లు స్త్రీలన్నివిద్యల నెఱుంగవచ్చును. కాన స్త్రీలు తమకర్తవ్యములను గుర్తించి, వివేకవతులై యుండుటమంచిది.

అదియుఁగాక నేటికాలపు స్త్రీలు నవనాగరికత హెచ్చినకొలది, శిశుపోషణమున్నగు పనులనన్నిటిని దాదులపైవేసి బిడ్డలస్వశక్తి నణచివైచుచున్నారు. ఇదియే ముఖ్యముగ మనదేశదారిద్ర్యమునకు హేతువని చెప్పవచ్చును. మనదేశముబాగుపడవలెనన్నచో బిడ్డలకు తల్లిపాలనలవఱచి బిడ్డలను స్వయముగపోషించి, యాదర్శగృహిణులుగ నుండవలయును.

మఱియుమనదేశమున స్త్రీలకుస్వాతంత్ర్యమిసుమంతయులేదనియు, స్త్రీలుబానిసలనియు నుడువుదురు. నిజమునాలోచించిన గృహవిషయములో పురుషుడు ధనమునార్జించి, తెచ్చుటకాని, ద్రవ్యముఖర్చుపెట్టు విషయమున స్త్రీలకే సమస్తహక్కులున్నవని చెప్పవచ్చును. మనమేకాదు, ఋషులువ్రాసిన ధర్మశాస్త్రములుకూడ నిర్ఘోషించుచున్నవి. ఇది యనాదిసిద్ధము, కాన స్త్రీలకు ఏవిధమగు హక్కులులేవనుట పొరపాటు.

కాలక్రమమున స్త్రీలకు కొన్నిహక్కులు నశించినను, ప్రభువులు ప్రాచీనపద్ధతి ప్రకారము కొన్ని హక్కులు నేర్పరచుచుండిరి.

ప్రాతక్రొత్తవిషయములమధ్య కొంతసంఘర్షణ తప్పదు. కాన మనహిందూదేశపు స్త్రీలందఱును, పూర్వపునారీమణుల నాదర్శముగగొని, విద్యావివేకములనంది, సంఘదోషములను నివారించినచో మబ్బు విచ్చినట్లు మనభారతమాత, కష్టములుకొన్ని నివారణమగును. అప్పటికికాని మనదేశము భాగ్యవంతముకాదు.

—[౦]—

## ఏజంట్లు కావలయును.

"గృహలక్ష్మి" మాసపత్రికలు విక్రయించుటకు - చందాదార్లను చేర్పించుటకు ఈ దిగువ, స్థలములలో ఏజంట్లు కావలయును.

ఇచ్ఛాపురం
సోంపేట
నరసన్నపేట
పాలకొండ
బొబ్బిలి
సాలూరు
తాడేపల్లిగూడెం
చీరాల
యలమంచిలి
కాకినాడ
కందుకూరు
కనిగిరి
గిద్దలూరు
కంభం
నర్సారావుపేట
పాలకొల్లు
అమలాపురం
జగ్గయ్యపేట

వివరములకు :

'గృహలక్ష్మి' కార్యాలయము,
15 వెస్టుకాట్ రోడ్డు,
రాయపేట,
మద్రాసు.

## "తెలుగు బాల వెలుగు"

శ్రీమతి దీక్షి దేవిగారు

పున్నంపురాత్రుల వెన్నెల కుచ్చెళ్ళు ఏపితామహినేర్పె నిందువదన!
సంధ్యవేళలయందు సాంబారుబుడ్డీలు ఏమామనేర్పెనే శ్యామకేశి!
మునిమాపుటెండల ముక్కలగిల్లీలు ఏయత్తనేర్పెనే పద్మాయతాక్షి!
వడగాడ్పుసమయాన వావనగుంటలు ఏతాతనేర్పెనే శ్వేతగాత్రి!

బొమ్మరింటపెళ్ళిళ్లు దోబూచులాట
చెమ్మచెక్కతో మొగ్గలు చేరడేసి
కీరికి తుమ్మెంద చక్కిలిగింతలాట
తెలుగుబాలకు తొలినాటి వెలుగులివ్వి॥

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. ఎన్. కేసరి

## కోటప్పకొండ ప్రభలు

కోటప్పకొండయను శివక్షేత్రమొకటి గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాలోనున్నది. మ్రొక్కుబళ్లకు తిరుపతికొండవంటిదే కోటప్పకొండయున్నూ. ప్రతిశివరాత్రినాడు ఆ కొండకు వేలకొలదిజనులువచ్చి శివునిదర్శించి పూజించిపోయెదరు. వారివారి మ్రొక్కుబళ్లను కోటయ్యకు చెల్లించెదరు. ఈ క్షేత్రము ఆంధ్రదేశమున పెద్దపేరు గాంచినది. గుంటూరుజిల్లాలో మెట్టతాలూకాలందలి రైతులు వ్యవసాయమునకు ముఖ్యమైన ఎడ్లను బిడ్డలవలెనే పెంచెదరు. గృహయజమాని జొన్నన్నమును ముద్దలుచేసి మ్రింగునపుడు చనువుకొలది కోడెదూడ లతనివద్దకువచ్చి అతడు కంచమునుండి ఎత్తి నోటి కందించు ముద్దలను తినిపోవుచుండును. అట్టి ఎడ్లకు, బిడ్డలకు జబ్బుచేసినపుడా రైతులు కోటయ్యకు ప్రభలు కట్టుకొని కొండకు నడిచెదమని మ్రొక్కుకొందురు. ఈ మ్రొక్కుబళ్లను చెల్లించుటకు అనేక గ్రామములనుండి రెండెద్దులబండ్లమీద ప్రభలనుగట్టి వాటిని చిత్రవిచిత్రములగు రంగుగుడ్డలతో శృంగారించెదరు. ప్రభయనగా వెదురుబొంగులతో రెండెడ్లబండ్ల గానులమధ్య అమరుటకు తగిన వెడల్పుతో సుమారు 10 అడుగుల పొడవున చట్టముగా కట్టుదురు. మధ్యమధ్య చీల్చిన అడ్డబద్దలువేసి బిగింతురు. పైఅంచున త్రికోణాకారముగానమర్చెదరు. ఆచట్టమునకు గుడ్డలనుకట్టుదురు. దానిపై రంగుగుడ్డలను తోరణములను చిత్రములను అలంకరింతురు. చిరుగంటలుకూడా కట్టుదురు. ప్రభలకేగాక వానిని లాగుటకై ఏర్పరచిన ఎద్దులకుకూడ ఆప్యాయముగ గంటలను, గజ్జలను, మువ్వలనుకట్టి అలంకరింతురు. ఈ బండ్లకుకట్టే ఎద్దులను ప్రత్యేక శ్రద్ధతో అన్నిటికన్నా హెచ్చుగా పోషింతురు. వీటికి పచ్చిజొన్నచొప్ప, ఉలవలు, పత్తిత్తులురుబ్బినపిండి పెట్టి పెంచెదరు. ఈ తిండినితిని ఆ వృషభరాజములు తెల్లగ తయారగును. వాటిచర్మము తెల్లటి వెలువెట్టుపట్టునుబోలి మిసమిస మెరయుచుండును. మెడలకు గట్టిన గజ్జెలపట్టెళ్లు, మొగమునకు తగిల్చిన కుచ్చులశిగమోరలు, కాటుకకండ్లు, కురచకొమ్ములు, మెడమీద పెద్దచెండువంటి గట్టిమూపురములు, మెడమీదుగా రొమ్ముచుట్టిరా బిగింపబడినతోలు పటకాలు—ఇన్నింటితో గాంభీర్యముట్టిపడ నడచివచ్చు ఆ ఎద్దులను

చూచినప్పుడు, పెండ్లికొడుకులు పెండ్లికి తరలిపోవుచున్నట్లు గాన్పించును. అవి నడచుచు, అప్పుడప్పుడు తలవిసరు వయ్యారమును, గాంభీర్యమును, అలంకారమును కనులపండువుగ నుండును. అట్లే ఉత్సాహముకొలది అవి వేయురంకెలును ఉత్తేజముగను ఉద్రేకకరముగను నుండుటయేగాక శంఖారవమువలె శ్రావ్యముగను ఉండును. సంగీతశాస్త్రమునందు ఈ రంకెనే సప్తస్వరములలో రెండవదియగు "రి" (ఋషభం) అని నిర్ణయించిరి. ఈ స్వరముచే వీరరసము, అద్భుతరసము, రౌద్రరసము వెల్లడియగునని చెప్పబడినది. (శార్ఙ్గధరుని సుభాషితములలో ఇట్లు నిర్వచింపబడినది. "షడ్జర్షభా తథా జ్ఞేయా వీరరౌద్రాద్భుతే రసే" ॥ ౧౭) కావుననే ఈ బండ్లకు బాగుగాబలిసిన కోడెలనుగాని కోడెప్రాయపు ఎడ్లనుగాని కట్టెదరు. ఈ బండ్లమీద కూర్చుని తోలేరైతులును మంచివయసు కుర్రవాండ్రుగనుందురు. మంచిదృఢకాయముకలిగి కందుకూరి తలగుడ్డలను చెఱ్ఱూ పాగాలుగా తలలకుచుట్టి, రంగురుమాళ్లను నడుములకు బిగించికట్టి ముల్లుకర్రలతో ముందు జల్లలలో కూర్చుందురు. మొలకు బిళ్లలమొలత్రాడు, కాళ్లకు ఎఱ్ఱబణాతు, గురిగింజలు అమర్చిన కిర్రుచెప్పులు, చేతులకు వెండిమురుగులు, సందిటదండకడియములు, చెవులకు జంపు, ఇత్యాదులతో సింగారించుకొని, కోరమీసములతో, కొంటెచూపులతో, కండ్లమీదుగా కణతలు కలియదిద్దితీర్చిన విభూతిరేఖలతో, కనుబొమలమధ్యనుంచిన కుంకుమబొట్టుతో, నోటనున్న గుంటూరుమెట్ట (పాటి) పొగాకు (బారెడు) చుట్టను త్రాగుచున్నట్లుగానే "ప్ప-ప్ప-ప్ప-ప్పా" అని ఎద్దుల నదలించుకొనుచు వారు బహు చలాకీగా సారథ్యమును సాగింతురు. ఆ మాత్రము అదలింపైన సహింపనట్లుగా ఆ కోడెలు రోషావేశమున పరవళ్లత్రొక్కుచు విసురుగా ముందుకు సాగిపోవుచుండును. అట్టివానిలో బాగుగా పొగరుబోతులైన కోడెలకాళ్లకు గిట్టలపైన త్రాళ్లుకట్టి ఇరువంకల చేబట్టుకొని, అదలించి, వానిదుడుకును నిగ్రహించుచు ప్రాయము వ్రాలుచున్న పెద్దరైతులు నడుస్తుంటారు. ఈబండ్లు మా ఊరిగుండాపోవునప్పుడు వూరిలోనివారు ఈ ప్రభలకెదురేగి, నిల్పి సత్కరించుచుండిరి. స్త్రీలు బుంగలకొలది నీరుతెచ్చి వారుపోయుటయు, పురుషులు, కత్తిపట్టుకొని దండకములు, ఖడ్గములు—అను తెనుగురచనలను ఆ వేశముతో "అద్దద్ద శరభ" యని చదువుటయు నా కింకను జ్ఞాపకము. సామాన్యముగ నీ ఖడ్గములను, దండకములను చదువువారు జంగములు, బ్రాహ్మణులగు ఆరాధ్యులు. వీనికి కథపట్టు సామాన్యముగా దక్షయజ్ఞధ్వంసమును శివలీల లేక వీరభద్రుని వీరవిహారము. మచ్చునకొక్క—

చరణము:—

"దక్షుని తలగొట్టి తగరుతలపెట్టి
అద్దద్దద్దద్ద శ్శరభ—శ్శరభ"

ఈ పాడేవారు ఒక కత్తిని చేతపట్టుకొందురు. లయతప్పక ముందు వెనుకలకు

నడుచుచు, గంతులు వేయుచు పరవళ్లుత్రొక్కుచు పాడుదురు. ప్రక్కనున్నొకడు చల్లగా రుంజవాయించుచుండును. మరొకవంక నొకడు—సామాన్యముగా నితడు ఎడమవైపు నుండును—డోలునో, కనకతప్పెటనో వాయించుచుండును. అంతంతల నిలిచినవారు కొమ్ములు, కాహళములు అదునుచూచి ఊదుచుందురు. సమీపస్థుడై మరొక్కడు రసముట్టిపడుపట్టున శంఖమొత్తును. ఇట్టిసన్నాహమధ్యమున—ఆవీరుడు,—ఖడ్గమునందలి యొకటి రెండు చరణములు చదివి—ఉసితో ఆ డోలువాయించు వానివద్దకు (లేక కనకతప్పెట వానివద్దకు)ఉరికి—ఆ వాద్య విశేషము అంటునట్లుగా తన తలను చెవి యోరన ఆనించి, చెవిగట్టిగా మూసుకొని—"అద్దద్దద్దద్ద శ్శరభ-శరభ" అని ఉచ్చస్వరమున పల్కును. ఆ పలుకునకు అనుగుణ్యముగా అతడా వాయిద్యమును గట్టిగా వాయించును. అసలా "శరభ" శబ్దము వాని నాభికమలమునుండి ఛేదించుకొని మారు మ్రోగుచు వెలికివచ్చును. అది వినుటకు మహాభయంకరముగను, రౌద్రముగను, భక్తులకు భద్రమొసగునట్టిదిగను యుండును. కొందరు వీరశైవులీప్రభలకెదుట నారసములు గ్రుచ్చుకొనుట, గండకత్తెరలు వేసు కొనుట అను అఘాయిత్యములుకూడా చేయుదురట.

ఈ కోటప్పకొండతిరునాళ్ల ఏటేటాజరుగు జాతీయమహోత్సవము. ఈతిరునాళ్లలో రైతులకు కావలసిన పనిముట్లను ప్రదర్శించి విక్రయించెదరు. రెండుమూడు దినములు ఈ కొండచుట్టూ జనులు, పశువులు, అంగళ్లు, కిటకిటలాడుచుండును. బిచ్చగాండ్రును విచ్చలవిడిగా వత్తురు. ఈ మహోత్సవము చూచుటకై అధికారులును ఆరోజులలో అచ్చట క్యాంపులు వేసుకొందురు. అక్కడికి వచ్చినజనులు పాకలలోను, చెట్లక్రిందను దిగి వంటలుచేసుకొనెదరు. సర్కారువారున్ను వచ్చినవారికి సౌకర్యములొనర్చి, పోలీసు బందోబస్తుగావింతురు.

ఈ ఉత్సవములకు ప్రభలవెంటను, విడిగాను ఆచుట్టుప్రక్కల గలస్త్రీలును విస్తారము వత్తురు. ఆప్రాంతమున విస్తారముగ మెట్టవ్యవసాయము. పురుషులతోపాటు అచ్చట స్త్రీలును పొలములలో పాటుపడ నేర్చినవారు. పల్నాడు ఇచ్చటికి సమీపప్రదేశము. పల్నాటి సీమనుగూర్చి శ్రీనాథుడు చెప్పిన చాటు పద్యములు:—

> రసికుడు పోవడు పల్నా డెసగంగా రంభయైన యేకులేవడుకుకా
> వసుధీశుడైన దున్నును కుసుమాస్త్రుం డైన జొన్నకూడే గుడుచుకా.
>
> చిన్న చిన్న రాళ్లు చిల్లర దేవుళ్లు నాగులేటినీళ్లు నాపరాళ్లు
> సజ్జజొన్నకూళ్లు సర్పంబులునుదేళ్లు పల్లెనాటిసీమ పల్లెటూళ్లు.
>
> జొన్నకలి జొన్నయంబలి జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
> సన్నన్నము సున్నసుమీ పన్నుగ పల్నాటి సీమ ప్రజలందరికిన్.

ఇట్టిప్రదేశముల స్త్రీలును స్వేచ్ఛా స్వాతంత్ర్యములుకల్గి, ధైర్యసాహసములతో పౌరుషవంతులై యుందురు. చూపునకును వడ్డుపొడుగుకల్గి, దేహపుష్టి, ఆరోగ్యముకల్గి, కంటికింపుగానుందురు. వారు ముతకకోకలను చుంగులుతీర్చికట్టి వెండిమురుగులు, ముక్కరలు, గూబావిలీలు, చెంపసరాలు మొదలైన పురాతనపు నగలతో అలంకరించుకొని కాటుకకండ్లతో, కడవలంతేసి వంకకొప్పులతో వత్తురు. అమాయకులైన ఈ స్త్రీలు తాంబూలము ఝూడించుచు మధ్య మధ్య పండినదా లేదా యని నాలుక ప్రక్కకుజాపి క్రీగంటచూచుకొనుచు ఉత్సవముల తిలకించుచుందురు.

కొన్ని సంవత్సరముల క్రితము ఇచ్చట ఈ తిరునాళ్లకు ప్రభలుకట్టుకొని వచ్చిన రైతులకును సర్కారు ఉద్యోగస్థులకును గట్టిపోరాటముజర్గి తుపాకులనుగూడ ప్రేల్చవలసి వచ్చినది. ఈపోరాటము కేసు కోర్టుకెక్కి కొందరు శిక్షింపబడిరి. తగిన బందోబస్తు చేయలేదనియు, సకాలమున విధి నిర్వహింపక దాగిరనియు కొందరు ఉద్యోగస్థులను తీసివేయుటయు జరిగెను.

ఆ గాథనుగూర్చి నాటిరోజులలో నిట్లుచెప్పుకొనిరి. చెన్నపరెడ్డియని ఆప్రాంతమున ఆరోజులలో మోతుబరి. అతనిగూర్చియే పామరులు, బిచ్చగాండ్రు, నేటికని

“రాజా చెన్నాపారెడ్డి-నీపేరే-బంగారపాకడ్డీ”

అని పాటలు పాడుచుందురు. ఇతని సాహసములగూర్చి ఎన్నియోకథలు చెప్పుదురు. ఇతడేదో మ్రొక్కుబడియుండి ప్రభకట్టుకొని కోటప్పకొండకు నడిచినాడట. ప్రభవెంట ఇతని సోదరియు వచ్చినదట. చెన్నప్పరెడ్డి ప్రభబండికి పూన్చిన ఎద్దులు పొగరు గ్రక్కుతూ నడుస్తున్నవి. నొగలకూర్చొని తోలువాడు, ప్రక్కతాళ్లబట్టి అదలించి నిగ్రహించువారు జాగ్రత్తగా నడిపిస్తున్నారు. కొండపైకి కొంతదూరమున కేగినమీదట ఆ ఎద్దులలో నొకటి జనసమూహమునుచూచి కొంత మొరకు చేయుచున్నది. పోలీసు భటులు అథార్టీ చేయవచ్చిరి. ‘‘మీరు కలుగజేసుకోవద్దు; మేము సమాళిస్తాము’’ అని ఆ ఎడ్లమచ్చికతెలిసిన రైతులనుచున్నను ఆపోలీసులలో నొకడు వినిపించుకొనక తన లాటీకర్రతో ఆ ఎద్దును పొడిచెను. అది రెచ్చిపోయినది. కలియద్రొక్కుచున్నది. అయినను ఆ రైతులు దానిని కొంతశ్రమపడి సమాళించగల్గువారే. కానిపోలీసుశాఖవారికా ఓర్పునేర్పులేక పోయినది. రైతులందరు—“వద్దు, వద్దు” అని అదలిస్తున్నా వినిపించుకోక వారు ఆ ఎద్దుపై తుపాకీని ప్రేల్చిరి. రైతుల కుద్రేకముకల్గినది. “చూస్తారేమిరా, మీసాలుగల మొగవాళ్లు” అని గర్జించి చెన్నపరెడ్డిసోదరి కోకవిరిచికట్టి గండ్రగొడ్డలితీసికొని ముందు కురికినది. ఎర్రటోపీగల (నాడుపోలీసులకు తెల్లదిరుసు, ఎర్రటోపీలు) తల ఎల్లా

ఎగిరిపోయినది. భూమిపై ఇంకాగింజలుగల పోలీసులంతా, తమయూనిఫారములు, టోపీలుతీసి పారేశారు. అధికార్లు చాలమంది అధికారచిహ్నములను జారవిడిచారు' నామాలుపెట్టుకొని దాసరులు, బూడిదపూసుకొని జంగాలు అయి నాటికి ప్రజా సామాన్యంలో కలిసి ప్రాణం దక్కించుకున్నారు. నిజంగా ఆనాడు కోటప్పకొండమీద చెన్నపరెడ్డి ప్రభముందు రక్తపువారులే పారినవి.

తమబిడ్డలనువలె కంచములోఅన్నము నోటికి కబళమందిచ్చి పెంచుకొనే ఎడ్లను గాసిపెట్టితే గుంటూరిరైతులు, అందును పల్నాటివారు సహించరు. 1921/-22లలో సహాయనిరాకరణపు గొడవలప్పుడు పోలీసులు జప్తుకువచ్చిరి. కన్నెగంటి హనుమంతు అనువాని ఎద్దులను జప్తుచేయదలచిరి. అతడుకాదనెను. ఆగందరగోళములో ఆతడు పోలీసుల తుపాకికి గురియై చచ్చెనేగాని—బ్రతికియుండగా తన ఎద్దును పట్టనివ్వలేదు.

శివరాత్రి ఫలహారములు

నాచిన్ననాడు మాఊరిలో ముఖ్యముగ ముందు ముత్తైదువులు (పూర్వాసువాసినీలు) ఉలవగుగ్గిళ్లు, జొన్నపేలాలు, పేలపిండి, భుజించి శివరాత్రినాడు జాగరణ సలుపుచుండిరి. ఈజొన్నపేలాలకు ఎర్రటి కొరవికారమునుపట్టించి భుజించెదరు. పేలపిండిలో పెరుగుకలిపి త్రాగెదరు. ఉలవగుగ్గిళ్లలో పచ్చిమిరపకాయలను కొరుకుతూ తినుచుండిరి కొందరు సొజ్జరొట్టెలను, తప్పెలబిళ్లలను, కాల్చి ఫలహారమును చేయుచుండిరి. ఈకటిక ఉపవాసములతో రాత్రిళ్లు జంగముకథలు, లక్ష్మణమూర్ఛ, శీతమ్మకడగండ్లు, విని జాగరణ చేయుచుండిరి. మరికొందరు అచ్చనగండ్లు గవ్వలాటలతోను, మరికొందరు చీలిజగడాలతోను రాత్రిఅంతయు ప్రొద్దుపుచ్చుదురు. తెల్లవారగనే యేటిలో స్నానము చేసి వంటకములను తయారుచేసుకొని బ్రాహ్మణునికి ఔపోసనవేసి పారణముగించెదరు. మరుసటిదినము మొదలు కొందరు అజీర్ణవిరోచనములతో శివరాత్రిఫలమును ప్రత్యక్షముగానుభవించుచుండిరి.

మా వూరి రంగిరీజులు

రంగిరీజులనగా గుడ్డలకు రంగువేయువారు. వీరు రంగులతో గండభేరుండ, కోటకొమ్మంచులను చీరలకు ధోవతులకు అంచుగట్టి అద్దుచుండిరి. ఒక చుక్క, మూడు చుక్కలు, అయిదుచుక్కలతో చుక్కల చీరెల నద్దుచుండిరి. ముదురు చెంగావి, పాల చెంగావి, చుట్టుచెంగావి చీరెలను ధోవతులను అద్దుచుండిరి. గువ్వకన్ను, నెమలికన్ను చీరెలనద్దుచుండిరి. ఈరంగులన్నియు గట్టిచాయలని పేరు. గుడ్డచినుగువరకు రంగులుపోవు.

ఆ కాలమున మనదేశమున లభించు కరక్కాయ, నీలిమందు, చిరివేరు, పబ్బాకు, మంజిష్ఠ మొదలగు వనమూలికలతో రంగులు వేయుచుండిరి. ఈ పరిశ్రమకు మా ఊరున్నూ (ఇనమన మెల్లూరు) గొల్లపాలెం బందరు, చీరాల, కరేడు, నెల్లూరు ఆరోజులలో మిక్కిలి ప్రసిద్ధివహించియుండెను. చెన్నపట్నం ప్రక్కనయుండే సైదాపేటలో కూడ ఈ రంగులను వేయుచుండిరి. ఈ పరిశ్రమ క్రమముగా నశించిపోయినది. విదేశీ కృత్రిమపురంగులువచ్చి మనమూలికల సంబంధమగు రంగుల పరిశ్రమను ఎట్లు ధ్వంసమొనర్చినదియు, కీ॥ శే॥ ఆచార్యప్రఫుల్లచంద్రరాయిగారును, ఆనందకుమారస్వామిగారును, విశేషముగా వ్రాసియున్నారు. బందరులో తయారుచేసిన రంగుచీరెలను మద్రాసు పచ్చయప్ప కళాశాల ప్రక్కనయుండు వీధిలో అమ్ముచుండిరి. అందువలన ఆ వీధికి బందరువీధి అని పేరుకలిగెను. ఆ వీధికి మునిసిపాలిటీ పేరు గురవప్పవీధి యని బోర్డుయుండినను వాడుక బందరువీధి యనియే పేరు. ఈ వీధిలో ముందు అరటిపండ్లను విస్తారముగ విక్రయించు చుండినందున అరటిపండ్లవీధి అనికూడ పేరుకలదు. ఈ వీధిలో నేను చిన్నతనమున చదువుకొనుచుంటిని. పిమ్మట కేసరికుటీరముకూడ ఈ వీధిలో చాలకాలముండెను. ఇప్పుడావీధి పరదేశపు సామానులతో నిండియున్నది.

## మా వూరిలో కోళ్లపందెములు

మా దేశమున సంక్రాంతి పండుగను పెద్దపండుగ అందురు. అప్పుడు వ్యవసాయపు పనులు కొంచము తక్కువ. భోగి, సంక్రాంతి, కనుమ, ముక్కనుమ వరుసగా పండుగ రోజులు. ఆ రోజులలో గ్రామస్థులు ఆటపాటల ప్రొద్దుపుచ్చెదురు. అందులో పెద్దపండుగరోజున మా వూరి రంగిరీజులు యేటివడ్డునయున్న చింతతోపులోనికిపోయి కోడిపందెములనాడేవారు. మంచికోడిపుంజులను ఈ పండుగకొరకు ప్రత్యేకముగ పెంచియుంచేవారు. వీటిని ఆ తోపులోనికి తీసుకొనిపోయి, వాటికాళ్లకు సన్ననికత్తులనుగట్టి, రెండు పుంజులను డీకొలిపి విడిచెదరు. అవి రెండును ముందు వెనుకలకు నడుచుచు ఎగురుచు కత్తులను గట్టిన కాళ్లతో రొమ్ములపై తన్నుకొనుచు పోరాడును. రక్తము ధారగ కారుచున్నను అవి పోరాటమును విడువవు. ఈ ప్రకారముపోరి కొంతసేపటికి యొకకోడి క్రింద కూలును. గెల్చినవాడు చచ్చినకోడిని తీసుకొనిపోయి రాత్రికి విందుభోజనమును చేయును. ఇది పల్లెటూర్ల పండగసంబరము. నాటికి సంబరమేగాని—కోడిపందెముల పగలు సామాన్యముగా నాటితో చావవు. పోరాటము సాగుచున్నప్పుడు చూచువారు రెండుకక్షులై పౌరుషపు మాటలతో ఆయాపుంజులను రెచ్చగొట్టి హుషారిచ్చుచుందురు. కోడిపుంజులును నైజముగనే రోషముతో పోరుచుండును. నిజమున కీమాటలవల్ల

రోషమెక్కుచున్నది ఇరుకక్షులకు. పండుగసంబరమున కొంచము మత్తుపదార్థములు పుచ్చుకొని అసలే హుషారుగానున్న ఆ గ్రామస్థులు ఈ రోషపుమాటలతో తామసము వహింతురు. పైగా ఆ కోళ్లపై కొందరు పదులు, నూర్లు పందెములు కాయుదురు. వానిని ధారపోసు కొన్నప్పుడు ఈ తామసము మించిపోవును. దానితో వారు కలియపడి కొట్టుకొనుటయుకద్దు. లేదా సంవత్సరము పొడవున కక్షలు పెంచుకొని అప్పుడప్పుడు కొట్లాడుకొనుటయుకలదు. ప్రసిద్ధిచెందిన పల్నాటి వీరయుద్ధమునకు మూలము "కోడిపుంజుల పందెమే" యని చరిత్రకారులు చెప్పుదురు. సామాన్యజనమునకు ఇవి సరదాగానున్నను సౌమ్యులు వీనిని రేసుకోర్సులను వలెనే ప్రోత్సహింపరు.

## కోలాటము

మా వూరి రంగిరీజులలో కొందరు మంచికోలాటపు పాటలు, నేర్చిన వారును గలరు. అప్పుడప్పుడు పెద్దగుంపుగకూడి ఒక దీప (గరుడ) స్తంభమును వెలిగించి దాని చుట్టు వీరుచేరి కోలాటమును వేయుచుందురు. లయతప్పక కర్రదెబ్బలను గట్టిగవేయుచు, ఎగురుచు దూకుచు, తిరుగుచు, ఇప్పటి స్కూళ్లలో ఆడపిల్లకాయలు కోలాటము జడను అల్లువిధముగ ఆడుదురు. వీరు మొదట

"శివశివ గణనాథా! — నీవు —
శివుని కుమారుడవు — గణనాథా!"

అను ప్రార్థన పాటతో కోలాటము ప్రారంభింతురు. ఆ పిమ్మట

"కోలంకోలన్న కోలం,
కొమ్మలిద్దరు మంచిజోడు"

అనే పాటను పాడుదురు.

## జంగము కథలు

ఆ కాలమున పల్లెటూళ్లలో జంగము కథలను చెప్పుచుండేవారు. ముఖ్యముగ బాలనాగమ్మకథ, బొబ్బిలికథ, దేశింగురాజుకథ, కాంభోజిరాజు రాజుకథ మొదలైన వానిని జంగములు చెప్పుచుందురు. ఆ రోజులలో ఈ కథలను చాల చాకచక్యముగ చెప్పగల్గిన వారుండిరి. ముఖ్యముగ మా గ్రామసమీపమునగల ధేనువుకొండ గ్రామమున ధేనువుకొండ వెంకయ్యగారను ప్రసిద్ధమగు సంగీతపాటకులు వాగ్గేయకారులు ఉండేవారు. ఆయన జంగం కథలను స్వయముగవ్రాసి తాను ప్రక్కన నిలిచి లయతప్పక అడుగు వేయుచు శిష్యులకు నేర్పేవారు. వీరు ఒకమాల వానికో, దూదేకుల సాహెబునకో,

స్వచ్ఛమగు ఉచ్చారణతోకూడ నేర్పిరనివింటిని. ఆ శిష్యపరంపర నేటికిని ఆ ప్రాంతమున కలదు. ఈజంగం కథలు చెప్పునప్డు కథలో ఆయాపట్టులకు తగినట్లు రసముట్టిపడ, హుంకరింపులు, పాదఘట్టనములు, హెచ్చరికలు, మున్నగువానినొనర్చుచు, ముందువెనుకలకు లయతప్పక నడచుచు, దుముకుచు, భుజమునపెట్టుకొన్న తంబురను కుడిచేతి వ్రేళ్ల మీటుచు, ఎడమచేతి వ్రేళ్లకు పెట్టుకొన్న బోలుకంచు ఉంగరములతో తంబురకుండపై దరువువేయుచు పాటపాడుచు నొకడు కథ నడుపుచుండును. అతని కిరువంకల ఇద్దరు గుంసీలు తీసుకొని వాయించుచు వంతుపాటపాడుచు అతనితో నడుచుచుందురు. పాట మధ్య మధ్య నిల్పుచు—ఆవంతు పాటగాండ్రిరువురు ప్రశ్నోత్తరములలో కథను వ్యాఖ్యాన మొనర్చుచుందురు. ఈ సందర్భముననే వారు హాస్యమును చెప్పుదురు. అయితే సామాన్యముగా నిది మోటహాస్యముగా నుండును. పైనచెప్పిన పండితులవద్ద స్వయముగా తర్ఫీదైనవారి హాస్యము పండిత సమ్మతమై సభ్యముగానుండును. అసలు జంగము కథారచనా విధానమే రసవంతమైనది. శ్రీ కీ॥ శే॥ వేదము వేంకట్రాయ శాస్త్రిలవారు బొబ్బిలికథ పద్యకావ్యములకన్న జంగము కథయే రసవత్తరమని చెప్పియున్నారు. అట్టి రచనను ప్రత్యక్షముగా పాటగాండ్రు ఒక విధమగు నాటకమాడి వినిపించి వివరించునప్పుడు శ్రోతలు తన్మయులగుదురనుట ఆశ్చర్యముగాదు. బొబ్బిలికథను వినునప్పుడు ప్రేక్షకులు ఉద్రేకులయ్యెదరు. బాలనాగమ్మ కథను విన్నస్త్రీలు జాలినొందెదరు. దేశింగురాజు కథలో అతని పరాక్రమమును, మహబత్ ఖానుని స్నేహమును వర్ణించి చెప్పునప్పుడు ఆ రోజులలోగల హిందూమహమ్మదీయ సఖ్యతను తలచి కొనియాడుదురు. ఈ జంగము కథలు యిప్పుడును ఆంధ్రదేశమున జరుగుచునే యున్నవని తలంచెదను. ఈ జంగముకథ పద్ధతి ననుసరించిచెప్పు కథలకే—ఇప్పుడు బుర్రకథలని చెప్పుచున్నారు. నూతనరాజకీయ సాంఘిక ప్రచారములను ప్రాచీన ప్రచారక పద్ధతుల ననుసరించి జంగము కథలు, తోలుబొమ్మలాటలు, వీధిభాగవతముల ద్వారా సలుపుట ఎంతోఫలప్రదమని కీ॥ శే॥ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు చిరకాలము క్రిందటనే చెప్పియున్నారు. అయితే అట్టి ప్రాచీన కళాసాంప్రదాయవేత్తల యాజమాన్యమున నీ నూతనమగు బుర్రకథ లేర్పడక పోవుటచేతనో, ఏమో, ఇవి, పూర్వపు వానికి కేవలము పేలవమైన అనుకరణములని రసజ్ఞులు అనుచున్నారు.






28 అల్లము:-దీనినే పాకముగా పండినపిదప శొంఠియనికూడా అందురు. ఇదియొక దుంప మొక్క. దీనిఆకులు పసుపుమొక్క ఆకులను బోలియుండును. దీనిని యెరుగని వారుండరు. అల్లం-పసుపుమొక్కలు యించుమించు వకమాదిరిగా వుంటాయి. ముఖ్యముగా మలబారులోను, డెల్టాభూములలోను, నెల్లూరు_కలువాయిలలోను అల్లం బాగా పండించబడుతునేవుంది. అల్లంమొక్క ప్రతియింటను నుండదగినది. భూమిలోపల చిన్నదుంపమాదిరి ఊరేకాండమే మనం తినేది. ప్రతిరోజూ వంటల్లో: అల్లం వాడుతునేవున్నాం. అల్లమును ఎండబెట్టి శొంఠిగా కడుపునొప్పివైద్యానికి ఉపయోగించడం అందరకుతెలుసును. నిమ్మరసం, అల్లం, కొంచెముకల్పి సేవించినప్పుడు సాధారణమయిన కడుపునొప్పి, వాయువు, అజీర్ణం మొదలయిన చిన్న చిన్నవాటికి అమోఘంగా పనిచేయడం సాంప్రదాయసిద్ధమైన వైద్యవిషయము. కనుక ప్రతియింటను స్థలంలేకపోతే కోర్టులో తొట్లలో దీనిని పెంచవలయును. ఇప్పటికీ ముసలమ్మలు తులసికోటల్లో దీనినుంచి పెంచి వాడుచున్నారు.

వైద్యులు దీనిని ముఖ్యముగ ఉత్తేజము కలిగించుటకును, అగ్నిమాంద్యము పోగొట్టుటకును, జంతువాతము, క్రిములు హరించుటకును, వాడెదరు. మరియు యేకారణముచేకల్గిన పాండువు, రక్తహీనత, నంజు, పాలిపోవుట మొదలగు లక్షణములుగల వ్యాధిగ్రస్తులకు అల్లమును షుమారు 2½ తులము మెత్తగచితుకకొట్టి నూరి మసలెడునీళ్లలోవేసి ¼ వంతుమిగులునట్లుగకాచి చిక్కనిగుడ్డతో వడబోసి ఉదయసాయంత్రములయందు తడవకు ½ ఔన్సు చొప్పునయిచ్చిన క్రమేణతగ్గి సంపూర్ణ బలవంతులగుదురు. మరియు దోషములన్నియు మూత్రరూపమున వెలువడును. కాని యిదేచికిత్సయని అన్నింటికిని వాడకూడదు. రోగనిదానమునను సరించి, శరీరతత్వమును గుర్తెరిగి, పూర్వాపరపథ్యనిర్ణయములను గమనించి ఈ కషాయమునిచ్చిన గుణమిచ్చుటయే నిజము.

లివరు చెడి బలహీనులై నాలుకరుచి తప్పినప్పుడుకూడ దీనిని పలువిధ ములు వాడనగును.

ఇట్టి కషాయమును సేవించు వ్యాధిగ్రస్తులకు పాలుగాని, గంజిగాని పథ్యము నివ్వవలయును.

తలనొప్పికి కణతలకు శొంఠిగంధం పట్టువేసెదరు. నిస్త్రాణచెందినపుడు శొంఠి చూర్ణము దూదిలో పొదిగి చెవిగూబ యందుంచెదరు.

శొంఠిపాలు చెవినొప్పులకు మంచిమందు. శొంఠికషాయము సర్వవిధముల మంచిది. శొంఠిచూర్ణము, లవణముచేర్చి తడవకు నాలుగణాలుయెత్తు అన్నములో చేర్చిగాని, పుచ్చుకొని తేటమజ్జిగను త్రాగిన పులితేపులు, పొట్టఉబ్బరము, భుజించుటచేకలుగు ఆయాసములునుండవు. డాక్టరు కోమర్‌గారు ఉపయోగించి గుణముకలదని తెల్పియున్నారు.

29 శాల్మలి:—దీనినే తెలుగులో బూరుగబంకయని పిలుతురు. ఈ చెట్టు అడవులలో పెరుగును. ఇది పత్తి, జిల్లేడుచెట్లతరగతిలో చేరిన దేకాని వాటికంటె పెద్దవృక్షముగ నుండును. కాయలుకాచి దూదివిడును. దానిదూది పరుపులకు, తలగడలకు యెంతమృదువుగ, చల్లగనుండునో దానిబంకయునట్లే ఔషధములసౌమ్యతకు నుప యోగించును. పురాణమగునెత్తురుబంక, నీళ్లవిరేచనములకును,క్షయవ్యాధులయం దును, దగ్గునప్పుడుగాని, కేవలముగగాని, నోటినుండిరక్తముపడుచున్నప్పు డును తడవకు 10 గ్రెయినులచొప్పునవాడిన గుణమిచ్చును. తాత్కాలిక, పురాణవిరేచనములకు వాడి గుణమిచ్చినట్లు డాక్టరు కోమర్‌గారు గవర్నమెంటు రిపోర్టులో వ్రాసిరి.

మరియు అనుభవనీయులగు ఆయుర్వేద వైద్యులు దీనిచూర్ణమును గర్భ స్రావములయందును,గర్భపతనానంతరముకల్గు స్రావములునిల్పుటకును, (కోకలు విడుచుట అనురహస్య గర్భదోషములకును) బియ్యపుకడుగునీటితో వాడెదరు. మోతాదు రెండుఅణాలుయెత్తు చాలును.

———:o:———

# ఇంటిపనులలో మెళుకువలు



## "బడిలో మీ బాలలు"

ప్రతిబాలుడూ, బాలికా బడిలో ప్రవేశించినతరువాత ఒక నవజీవితం వారిలో ప్రారంభ మవుతుంది. అంతవరకూ తల్లిముఖం, తప్పితే యింటి పరిసరాలలోవున్న బాలల ముఖాలుమాత్రమే చూచివున్నబాలలు బడిలో ప్రవేశించగానే క్రొత్త అనుభవాన్ని సంపాదిస్తారు. ఒకవిధమైన సంఘ జీవనానికి అలవాటు పడతారు. బడిలో ప్రవేశించిన మొట్టమొదటిరోజున, యమునిలాగ కనుపించే ఉపాధ్యాయుని ముఖం, వందలకొలదీవున్న పరిచయంలేని తదితర బాలురముఖాలు ఆ రోజున ఒక్కసారిగా చూడ్డంలోనే ప్రతిబాలునికీ బాలికకూ గుండె బేజారవడం, కొందరు బొత్తిగా పిరికి బాలలువుంటే ఒక్కసారిగా "బేరు" మనడం సర్వకాల సామాన్యమైన వింత.

పాఠశాలనుంచి తిరిగివచ్చినబాలని చూడ్డానికి మరీసరదాగా వుంటుంది. కొందరు పగిలిపోయిన పలకలతోటీ, కొందరు తలనిండాదుమ్ముతోటీ, మరికొందరు చినిగిపోయిన బట్టలతోటీ యింకాకొందరు నలిగిపోయిన పువ్వులతోటీ బడినుంచీవస్తారు. ఇంటికిరాగానే తల్లులతోటి "అమ్మా వాళ్ల అమ్మాయి నా జడలాగిందేవ్" అనీ, యింకోకళ్ల అమ్మాయి నాపువ్వులు నలిపివేసిందేఅని పిల్లలు ఫిర్యాదుచెయ్యడం మామూలే. ఇలా పిల్లలుచేసే ఫిర్యాదులలో సత్యాసత్యాలను గ్రహించడం తల్లులకు మహాకష్టం. అయినా అలాటి సమయాల్లో పిల్లలని మందలించకుండా ఉండడం మంచిది. బలహీనులైన బాలల తండ్రులు ఉపాధ్యాయుల వద్దకుపోయి తమ తమ పిల్లలను జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూండమని చెప్పడం అవసరం.

పిల్లలు బడినుంచి సాయంకాలం యింటికిరాగానే పెద్దవాళ్లు "ఈవేళ బడిలో ఏమిచదివావు?" అని ప్రశ్నిస్తారు. ఇలా అడగడం చాలా తప్పు. రోజంతా బడిలో అలసిపోయి, యింటికిరాగానే ఒక కప్పు టీతాగి ఆటలకి వెళ్లడానికి ఉత్సహించే బాలలను యీ పై ప్రశ్న అడిగినప్పుడు వాళ్లకెంత చికాకుగా ఉంటుందో ఊహించాలిమనం. అందుచేత పిల్లలు సాయంకాలం బడినుండిరాగానే ఆటలకుపంపి, తిరిగివచ్చిన తరువాత భోజనంపెట్టి, కొంచెం స్థిమితపడిన తరువాతమాత్రమే చదువువిషయం మాట్లాడాలి. ఆ మాట్లాడడంలోను పూర్తిగా పాఠశాలవిషయం మాట్లాడకూడదు. ప్రపంచజ్ఞానాన్ని తెలిపేటట్టు, సరదాగావుండేటట్టు మాట్లాడాలి.

తరువాత యింకోవిషయం. పిల్లలకు ట్యూషన్స్ పెట్టి బాధపెట్టకూడదు. అసలే రోజంతా బడిలో అలసివున్నవాళ్లకి ట్యూషన్స్ పెడితే వాళ్ల మెదడుకు శ్రమహెచ్చుతుంది. అయితే, చదువులో వెనుక బడివున్నవాళ్లకిమాత్రం ట్యూషన్స్ చెప్పించడం అవసరం. పిల్లలచదువు ఎలా అభివృద్ధిఅవుతున్నదీ తెలిపే రిపోర్టులు ఉపాధ్యాయులు పంపుతారు. ఆ రిపోర్టులుమాత్రం తలితండ్రులు జాగ్రత్తగా పరిశీలిస్తూ ఉండాలి. పిల్లలకు బడి అంటే ఉత్సాహకరమైన ప్రదేశంగా వుండేటట్టుచూడాలి. ఈ బాధ్యత తలితండ్రులదే. తమతమ పిల్లలను బడికివెళ్లమని ప్రోత్సహించాలి కాని, గుడికి మేకపోతును

తోసినట్లు బలవంతంగా బడికి పంపకూడదు. ప్రతిరోజూ, నాగా లేకుండా బడికి హాజరవుతే నెలనెలా తమపిల్లలకు బహుమతులిస్తామని తలితండ్రులు ప్రోత్సహించాలి. ఆ యిచ్చే బహుమతులు, చిన్నచిన్న బొమ్మల పుస్తకాలే కావచ్చు, పెన్సిళ్ళే కావచ్చు, లేక ఆఖరికి బలపములే గావచ్చు - ఏదైనా బహుమతి పేరుతో యిస్తే పిల్లలకెంతో ఆనందంగా వుంటుంది.

తమ పిల్లల విద్యను గురించి యితరులతో చెప్పేటప్పుడు పిల్లల సమక్షంలో ఎప్పుడూ చెప్పకూడదు. అంటే కొందరుపెద్దలు "మా అమ్మాయి మొన్నపరీక్షలో క్లాసు కంతకీ ఫస్టుగా ఉత్తీర్ణురాలయింది" అని గొప్పగా చెపుతూంటారు. ఇలా చెప్పేటప్పుడు పిల్లలు దగ్గరలోవుంటే ఆ మాటలువిని తమనేకదా ఆలా పొగుడుతున్నారు అని గర్వించి మరునాటినుంచి పుస్తకాలే ముట్టరు. పొగడకూడదు అన్నారుకదా అని పెద్దలు తమపిల్లల్ని వారిఎదురుగా నిందించనూ కూడదు. అలా నిందిస్తే వాళ్ళకి చదువులో రోత జనించి నిరుత్సాహ పరులౌతారు.

క్లాసులో పాఠాలు బాగుగా చదివే యితర విద్యార్థులను తమపిల్లలకు ఆదర్శంగా చూపి, వారితో సరిసమాన మయ్యేలాగ కష్టపడి చదవాలని తమపిల్లలను పెద్దవారు ప్రోత్సహించాలి. "చూశావురా అబ్బాయీ! వాళ్ళపిల్లవాడికి లెఖ్ఖలలో నూటికి తొంభైమార్కులు వచ్చాయిట. మరి నీవు మళ్ళీపరీక్షలో నూటికి నూరు మార్కులు తెచ్చుకొని వాళ్ళ అబ్బాయిని మించాలి సుమా." అని యిటువంటి ప్రోత్సాహకరమైన మాటలు చెప్పి, వారిలో ఒకవిధమైన జిగీష (Rivalry) ఏర్పడేటట్లు చెయ్యాలి. ఈ విషయంలోనే సుప్రసిద్ధ చరిత్రగారుడు మెకాలే యిలాచెప్పాడు. "నా చిన్నతనంలో పాఠాలు ఎంతో బాగా చదివేవాడిని. చిన్నతనంలోనే కవిత్వం వ్రాసి మా నాన్నకు చూపితే ఓస్ యింతేనా? యిలాగ ఏ యితరవిద్యార్థి అయినా వ్రాయగలడు. ఇంకా బాగా వ్రాయాలి" అనేవాడు. ఆయన అలాగన్నకొద్దీ నాకు యింకాబాగా రాయాలని ఉద్రేకంగా వుండేది." నిజానికి మెకాలే రచయితగా కీర్తిగడించడానికి తలితండ్రులే కారణం అని చెప్పాలి.

తుదిమాట. ఒక్కొక్కబాలకు ఒక్కొక్క కళలో అభిరుచులుంటాయి. కొందరిపిల్లలకు సంగీతమంటే యిష్టం. మరికొందరికి డ్రాయింగు అంటేయిష్టం. కొందరికి సైన్సుఅంటే యిష్టం. మరికొందరికి కవిత్వం చెప్పడమంటేయిష్టం. ఇలాగ అనేకవిధాలుగా వుంటాయి. బాలలను చిన్నతనంలో నిశితంగా పరిశీలిస్తే వాళ్ళ అభిరుచులు చిన్నతనంలోనే తెలుస్తాయి. ఈ అభిరుచులకు అనుగుణ్యంగా పెద్దలు తమపిల్లలకు విద్య గరపాలి. పెద్దలు యీవిషయాన్ని పరిశీలించకుండా తమపిల్లలకు విద్యనేర్పిస్తూంటే బాలలు ఎన్నటికీ అభివృద్ధిలోకి రాజాలరు. కనుక పెద్దలు యీవిషయాన్ని ఏమఱకుండా అతి జాగ్రత్తగా గమనించాలి!

అల్లంరాజు విశ్వనాథం.





# బ్ర తు కు తె రు వు



అంటుమామిడిపండ్లతో మురబ్బా తయారొనర్చు విధానము :

ఈ విధమైన మురబ్బాలు తయారుచేయుటకు మల్గోవాపండ్లు ఉత్తమము. లేదా పెద్దటెంక, పీచులేకుండ మంచి కండకలిగిన పండ్లైననూ యుండవలయును. కోసినపుడు మంచితెల్పుతోకూడిన పసుపువర్ణముకలదై యుండవలయును. అయితే మిగులపండినవి, సగముపండినవి యెంతమాత్రము ఉపయోగించబడవు. గతసంచికలో చెప్పబడినతీరున జాగ్రత్తగా చెక్కుతీసి కండనుమాత్రమే గ్రహించవలయును. టెంకనుతీసి వేయవలయును. మామిడిగుజ్జుతోకూడినకండ 19 పౌనులు; చక్కెర 21½ పౌనులు; ఏలకాయలపొడి చూర్ణించినది 2½ ఔన్సులు; తయారుచేసుకొని వుంచవలయును. ఇట్టిమామిడికండ కొంచెముపులుపుగానున్నదని తోచినయెడల షుమారు 2½ గంటలసేపు యెనామలు పాత్రయందు నీటిలోమునుగ నుంచుము. ఇంకకొంచెము పుల్లగనున్నయెడల మరియొక జాము ఆనీళ్లలోనేయుంచుము. నీరును వంచివేయుము.

ఒక విధానము:-ఒక వెడల్పాటిపాత్రలో తగుమాత్రము నీళ్లతో మామిడిగుజ్జు నంతయునుంచుము. మూతపెట్టకుము. బాగా కాగపెట్టుము. తయారయిన సిరపు సగము కాగానే నిప్పుసెగన నుంచుము. మాడకుండ పలుపర్యాయములు కలియబెట్టుము. సిరపు చిక్కపడుచున్నదని తెలియుసమయములో యేలకాయలచూర్ణమునుకలిపి సుగంధద్రవ్యములను జేర్చి ఆ రాత్రియంతయు చల్లారనిమ్ము. మరునాటిఉదయమున అట్లుతయారయిన జాము, మురబ్బాలను సీసాలలోనుంచుటకు, సీలువేయుటకు, అవసరములగుపనికరములు, కార్కు, అందముగనుండుక్యాపు, వ్యాపార రక్షితమగునట్టి లేబిల్సు దగ్గరనుంచుకొనుము. సీసాలలో పైమురబ్బానువేసి గట్టిగాకార్కులతోమూసి లేబిల్సుఅంటించుము. అట్లుదానిని విక్రయమునకు సిద్ధముగానుంచుకొని విక్రయించుటే బ్రతుకు తెరువు.

మ రి యొ క వి ధా న ము :

మామిడిపండును చెక్కుదీసి, కత్తితో-హోటళ్లలో అల్లము, పచ్చిమిరపకాయలను సన్నపొట్టుగాచెక్కునట్లు, చెక్కవలయును. అట్లుచెక్కబడినపొట్టు 20 శేర్లు(తూకం) తయారుచేయుము. దానిలో ¼ శేరు (తూకం) మంచిమెత్తని సున్నమునుపొదిపి, సుమారు ఒక శేరు (కొల్త) నీళ్లనందుపోయుము. చల్లారనిచ్చి వడగట్టుము. ఆపొట్టును మంచినీళ్లతో 24 గంటలు నాననిమ్ము; తర్వాత చల్లనినీళ్లతోకడిగి, వంచి, పొట్టుఏవిధముగా నలగకుండా, నీటినిబాగాపిండుము. ఆపిదప దానిని - పైన మొదటివిధమున వలెనే కాగబెట్టి మురబ్బా తయారు చేసుకొనుము. దానిని భద్రమొనర్చి విక్రయించి లాభముపొందుము.






## పల్చని పుల్లపచ్చళ్లు

దక్షిణాది తెలుగువారు ముద్దపచ్చళ్లను ఊరుబిండి అని, అరవవారు చట్నిఅని అనెదరు. కనుక వారు వాడేపచ్చళ్లన్నియు పల్చగనేయుండును.

## పచ్చిమిరపకాయల పులుసుపచ్చడి

చింతపండును నీళ్లలోవూరనిచ్చి చేతితోబాగుగాపిసికి యీనెలను, విత్తులనుతీసివైచి గుజ్జును రాతి మరిగలోపోసి పొయ్యిమీదపెట్టి కొంచెమునీళ్లుకూడకలిపి కావలసినఉప్పును, పసుపుపొడిని రాతిచిప్పలో (మరిగె) వేసి కలిపి మరగనియ్యవలయును. పిమ్మట వేరుపొయ్యిమీద బాణలిపెట్టి నూనెనుపోసి కాగిన పిమ్మట, ఇంగువ యెండుమిరపకాయలను (తొడిమలుతియ్యకనే) ఆవాలు, కొద్దిమెంతులు నూనెలోపోసి చిటపటవేగినపిమ్మట పొడుగాటి పచ్చిమిరపకాయలనుకూడ బాణలిలోవేసి దానితోకూడ కరేపాకునుచేర్చి పచ్చిమిరపకాయలు కొద్దిగ వేగినపిమ్మట ఈ బాణలిలోని తిరగమాతను రాతిమరిగలో కాగుచుండు పులుసులో పోయవలయును. అన్నియు కలిపినపిమ్మట సన్నసెగమీద పులుసును నిదానముగ కాచవలయును. తేనెపాకముగ కాచవలయును. కడపట కొద్దిగ మెంతిపొడిని, చక్కెరను, చేర్చి దించవలయును. ఈపచ్చడిని రాతిమరిగలోగాని, జాడీలలోగానిపోసి కొన్నిదినములవరకు వాడుకొనవచ్చును.

## అల్లంపులుసు పచ్చడి

అల్లమును బాగుగాకడిగి సన్నముక్కలుగ కత్తితోకోసి, బాణలిలోవేసి నూనెలో ఎర్రధాళువుగ వేయించి ఉంచుకొనవలయును. మిరపకాయపచ్చడి తయారుచేసినట్లుగనే పులుసును తయారుచేసి, పచ్చిమిరపకాయలుకాకుండ, యెండుమిరపకాయలతో తిరుగమాతగింజలనువేయించి కాగుతున్నపులుసులోపోసి పైపచ్చడిమాదిరిగనేకాచి తయారుచేయవలయును. ఇదికూడ కొంతకాలము నిల్వయుండును.

## పచ్చికొబ్బర పులుసు పచ్చడి

పచ్చికొబ్బరను తురిమి నెయ్యిలో యెర్రధాళువువచ్చువరకు వేయించికొని పైపచ్చళ్లను తయారుచేసినట్లు తయారుచేసి, పులుసులోవేసి కలుపవలయును. పిమ్మట నూనెలో ఇంగువ మిరపకాయలు, తిరుగమాతగింజలువేసి పక్వముగవేగినపిమ్మట కాగుచుండు పులుసులోవేసి నిదానముగకాచి పాకమురాగానే దించి వాడుకొనవలయును. ఈ పచ్చడి మంచిసువాసనగను, రుచికరముగనుండును.

## బెండకాయ పులుసు పచ్చడి

లేతబెండకాయలను సన్నగతరిగి నూనెలోవేయించి, పైపచ్చడివలెనే తయారుచేయవలయును.

## వంకాయ పులుసు పచ్చడి

లేతవంకాయలను ముక్కలుగతరిగి నూనెలోవేయించి పైపచ్చళ్ల మాదిరిగనేకాచి భుజింపవలయును.

## ఉల్లిగడ్డల పులుసు పచ్చడి

ఉల్లిగడ్డలను సన్నగతరిగి, చమురులోవేయించి పైపచ్చళ్లమాదిరిగనే పులుసునుకలిపి కాగబెట్టి దానిలో యీ వేగిన ఉల్లిగడ్డముక్కలనువేసి నిదానముగ పక్వముగకాచి వాడుకొనవలయును.

## వెలగకాయ పులుసు పచ్చడి

పండువెలగకాయను పగులకొట్టి అందులో బెల్లమునుకలిపిన పల్చపడును. పైమాదిరిగనే పులుసును కాగపెట్టి అందులో వెలగకాయ గుజ్జునుకలిపి, కలియబెట్టి పచ్చిమిరపకాయ ముక్కలను, కొతిమిరాకును వేసి కాచవలయును.

## పచ్చిపులుసు పచ్చడి

చింతపండును నీళ్లలోనానవేసి, పుల్లలను, విత్తులనుతీసివేసి చారుగ పులుసును తయారుచేసికొని అందులో పప్పు, బెల్లము, పచ్చిఉల్లిగడ్డల ముక్కలుతరిగి కలుపవలయును. పచ్చిమిరపకాయలను తరిగివేసి భుజించిన బాగుండును. దీనిని పొయ్యిపై కాచనక్కరలేదు.

## కాకరకాయ పులుసు పచ్చడి

పెద్దకాకరకాయలను నాల్గుపక్షములుగతరిగి, పిమ్మట సన్నముక్కలుగచేసి చమురులో వేయించుకొనవలయును. పిమ్మట పైనచెప్పిన మిరపకాయ పచ్చడిని తయారుచేసినట్లు పులుసును మరిగెలోకాచి, ఆ కాగుచుండు పులుసులో, వేయించిన కాకరముక్కలనువేసి పాకముగ కాచ వలయును. కాకరకాయ గనుక చక్కెరను కొంచమధికముగవేసిన మంచిది.

## కామంచి కాయల పులుసు పచ్చడి

పచ్చి కామంచికాయలనుకోసి కొద్దిగ నూనెలోవేసి వాడ్చి, పైనచెప్పిన పులుసు పచ్చళ్లమాదిరిగనే పులుసునుకాచి, వేయించిన కామంచికాయలనువేసి పక్వముగకాచవలయును. బెల్లమునుకూడచేర్చవలయును.

* * *

## ధనియాలపొడి

ధనియాలను, యెండుమిరపకాయలను బాణలిలోవేసి పక్వముగవేయించి అందుకుతగిన ఉప్పునువేసి కొద్దిగ యెండుచింతాకుపొడినిగాని, చింతపండునుగానివేసి అన్నింటిని రోటిలోవేసి మెత్తగ పొడికొట్టవలయును. కొందరు దీనిలో వెల్లుల్లినికూడచేర్చి పొడిగొట్టెదరు. లేక బాణలిలో నూనెవేసి ధనియాలను, మిరపకాయలను యింగువనుకూడ వేయించి పైమాదిరిగ పొడికొట్టవలయును.

## గసగసాలపొడి

గసాలను, యెండుమిరపకాయలను పక్వముగవేయించి, ఉప్పునువేసి పొడికొట్టి వాడుకొనెదరు. రుచిగనుండును.

## దోసవిత్తులపొడి

దోసవిత్తులను పక్వముగ వేయించికొని రోటిలోవేసి పొడిగొట్టి, ఆ పొడిని పెద్దకండ్లుగల జల్లెడలో జల్లించిన విత్తులపొడి, తోలు, వేరగును. ఆపొడికి తగినమిరపకాయలను వేయించుకొని, ఉప్పువేసి పొడికొట్టి కడపట దోసవిత్తులపొడినికూడకలిపి త్రొక్కి వాడుకొనవలయును. ఈ ప్రకారమే గుమ్మడివిత్తులను పొడి చేయవచ్చును.

## గోగువిత్తులపొడి

గోంగూర విత్తులను, మిరపకాయలను వేయించి, ఉప్పువేసి పొడికొట్టవలయును.

## చెట్నిపొడి

ఎండుమిరపకాయలను, ఇంగువను, మినపప్పును, శనగపప్పును యెర్రగ నూనెలోవేయించి, కొద్దిగ చింతపండును తగినఉప్పునువేసి పొడికొట్టవలయును. కొందరు యెండుకొబ్బెరను తురిమికలిపి పొడికొట్టెదరు. అయితే కొబ్బెరవేసిన త్వరలోనే వాసనపట్టును. ఈ పొడిని అన్నములోను, ఇడ్లి, దోసెలువగైరాలకు వాడుకొనెదరు.

## తెల్లగడ్డల కారపుపొడి

వెల్లుల్లిపాయలను పైపొట్టుతీసి, మిరపకాయలను ఉప్పునుచేర్చి పొడికొట్టుకొని వాడుకొనెదరు. ఇది యెర్రగనుండును.

## బాలింతల కారపుపొడి

ఎండుమిరపకాయలను నూనెలోగాని, వంటఆముదములోగాని యెరుపురంగు మారువరకు వేయించి, అందులో వెల్లుల్లిపాయలనుకూడవేసి, చింతపండును తగిన ఉప్పునువేసి పొడికొట్టవలయును. దీనిని ప్రసవించినస్త్రీలు వాడెదరు. ఇది నల్లగనుండును.

## గొడ్డుకారంపొడి

ఎండుమిరపకాయలను యెండలోపెట్టి పొడికొట్టి, జల్లించి యిండ్లలో పెట్టుకొనెదరు. ఈ పొడిలో ఉప్పునుకలిపి అన్నములోకలుపుకొని నెయ్యిని ధారాళముగ వేసుకొని భుజించెదరు, కొందరాంధ్రులు.

## నిమ్మపండురసం కారము

పైనచెప్పిన గొడ్డుకారంపొడిలో, ఉప్పునుకలిపినపిమ్మట నిమ్మపండురసమునుపిండి, పల్చగచేసి గుంటూరుజిల్లావారు అన్నములో కలుపుకొని తినెదరు.

## పచ్చికరేపాకుపొడి

ఎండుమిరపకాయలను వేయించుకొని, పచ్చికరేపాకునుమూసి ఆ మిరపకాయలలోకలిపి ఉప్పువేసి రోటిలోవేసి పొడికొట్టుకొనవలయును. దీనిలోను కొద్దిగ నిమ్మపండురసము పిండిన రుచిగనుండును.

## ఎండుకరేపాకుపొడి

ఎండుకరేపాకుపొడిని కూడ పైనచెప్పినమాదిరిగనే తయారుచేయవలయును. ఇందులో కొద్దిగ యెండు చింతాకుపొడినికూడ చేర్చి పొడికొట్టిన బాగుండును.

———:♦:———

# సోమపాట (ద్విపద)

వంగోలు వెంకటరంగయ్యపంతులుగారు బి.ఏ. బియస్.

(సేకరించి పంపినది.)

సోమసంభవయట సుదతి[69] ప్రాతికము
సోమయాగము కొను సోమంబువలెనె.
అతి చణుడయిన[70] యీయధ్వర్యు మొదలు
నలుగు[71] రధ్వర్యులు నలువందగాను
నాలుగుదిక్కుల నలువయో యనగ
నలినాక్షి యభి[72] షవం బమరెను నిచట
రమ్ము చూడుము యహోరాత్రి ప్రయోగంబు
రమణీయముగ నిందు రంజిల్లుచుండు
ప్రాతరను[73] వాకంబు ప్రస్తుతింపగను
నీతితో సవ[74] నీయ నిర్వాపములను
మతిమంతులందరు మన్ననసేయ
సవనీయ[75] పశువును చక్కగా దెచ్చి
హవనంబు జేసెను యగ్నిహోత్రునకు
ఇంద్రవాయవ్యాదులయిన[76] గ్రహములను

* * *

సంభ్రమముతో జూడు సరసీరుహాక్షి
ఆ జ్యోతిశ్శ[77] స్త్రము లతి బుద్ధిహోత
పూజ్యులందఱు వినగ భూమిశంకింప
ఇచట నోధా[78] మోద ఇవయని చెలగి
శోం[79] సామో దైవయని యధ్వర్యుడనగ

* * *

ముదితరో విను మధా[80]మోదైవయనగ

* * *

మరియు మోదా[81] మోద ఇవయనిచెలగి
వీరిని జూడంగ వైశ్వదేవాగ్ని
మారు[82] తశస్త్రముల ప్రాశ్నింపుచుండ్రు
మఱియు ప్రాత[83] స్సవన మమరించి తొలుత
చెలియ మా[84] ధ్యందిన సవనంబుతోడ
సాయమందు[85] తృతీయ సవనంబు సరియ
సాయముల సవనములు నిఖిలయాగములు
అవ[86] భృథేష్టి చరించి హర్షంబుమీర

* * *

ఉదవ[87] సానీయ ముచితముగ జేసి
వేదఘోషంబుతో వేడుకమీర
యజ్ఞపురుషునితోడ యింటికేతెంచి

* * *

గార్హ[88] పత్యమునందు ఘనముగా నుంచి

* * *

ఉదవసా[89] నీయేష్టి యొప్పుగావించి

* * *

దర్శ[90] పూర్ణిమలందు దప్పకయిష్టి

* * *

సర్వకాలంబును చేయుచునుండ్రు

* * *

నందేల సుబ్రహ్మణ్య యజ్వపుత్రియు

* * *

ఈయజ్ఞపాటను సిద్ధించెగదరె

* * *

ఈ పాటపాడిన పడతులకెల్ల
ఆపదలెల్లను యడగిపోచుండు

ప్రాజ్ఞుడవ్వాండ్డైన పాటను వ్రాయ
యజ్ఞపురుషుండిచ్చు నఖిలలోకముల.

69 దీనికి ప్రమాణము మృగ్యముగనున్నది. అనుభవములో ప్రత్యక్షముగ సోమలత లభించుటలేదు. తత్పర్యాయముగ పూతికనో-తిప్పతీగెనో (సురవల్లి) యుపయోగించునటులున్నది. దీనినే ప్రత్యక్షసోమలతగా గౌరవించి యజ్ఞకల్పములోనున్న విధానమంతయు జరుపబడుచున్నది. (క్రైస్తవులు యూకరిస్టు అను పండుగు నాచరించునపుడు నివేదించు రొట్టెయు ద్రాక్షరసమును—Bread & Wine—సాక్షాత్తు శ్రీయేసు క్రీస్తు భగవానుని మాంసరక్తములగునని భావించి గ్రహింతురట).

70 అధ్వర్యువునకు "అతిచణుడు" అను బిరుదవిశేష మిందు అర్పింపబడినది. ఋత్విక్కులలో నధ్వర్యువు కుశాగ్రబుద్ధియై సర్వతోముఖ ప్రజ్ఞకల వాడుగనుండును. ఇతర ఋత్విక్కుల కార్యభాగములను గూడ చక్కగ నెరిగినవాడై అందరికిని తోడువుగనుండును. రాత్రింబగళ్లు ఆజ్యహోమముల జేయుచుండు వాడైనను నేర్పరిఅయిన అధ్వర్యువు తనవ్రేళ్లకొకచుక్కయైన నెయ్యిఅంటకుండ పనిచేయుచుండును. కేవల శాస్త్రజన్యజ్ఞానమును పూర్వికుల అనుభవజన్యజ్ఞానమును ఆధారముచేసికొని వపాదుల పశుకళేబరమునుండి తీయునపుడు మహానేర్పరియగు శస్త్రచికిత్సకుని (Surgeon) కేమాత్రమును తీసిపోక వపాస్థానమెద్దియో వృక్యాద్యవయవముల స్థానములెవ్వియో గుర్తెరిగి అవి తనకంటియెదుటనున్నటుల వానితోటి వ్యాపారములు తటస్థించినపుడు నూటిగ వెంట్రుకవాసి తప్పకుండ తనచేతులకు రక్తమేదోమాంసము లంటకుండ పట్టు కత్తిరించినటుల నీటుగ (neat) తనపనుల నెరవేర్చును. ఈతనిని చణుడనుటయేగాక అతిచణుడనుటయు యుక్తముగనేయున్నది.

71 నలుగు రధ్వర్యులు అనగా, అధ్వర్యగణములోని నలుగురు:—
(1) అధ్వర్యువు (2) ప్రతిప్రస్థాత (3) నేష్టా (4) ఉన్నేతా.

72 అభిషవము=సోమాభిషవము=సోమలతను (గాని దాని పర్యాయమగు పూతికనుగాని) దంచుట.

73 ప్రాతరను వాకము=

74 సవనీయ నిర్వాపములు=

75 సవనీయపశువు=యాగమునకు నియతముగ విధింపబడియుండు పశువు. పశువు అనగా నల్లని వెంట్రుకలుగల మేకపోతు. సాధారణముగ ఒకయాగమునకు అగ్నిషోమీయపశువు ఒకటియుకలదు. ఒక యజమానునికి దౌర్బాహ్మణ్య దోషమున్నయెడల తన్నివృత్తికొరకై ప్రాయశ్చిత్తపశువుకూడయుండును. దీనిని ఆశ్వినపశువందురు.

అతి రాత్రములను యాగమునకు మేషిఅను ఆడుమేకను పశువుగ నుపయోగింతురట.

76 గ్రహములు=అనగ సోమరసమును గ్రహించియుంచుపాత్రలు. నాల్గవదినమురాత్రి తెల్లవారు జామున అధ్వర్యువచ్చి ఈ గ్రహములను సిద్ధముచేయును. ఇవి ముప్పదిపాత్రలుగనున్నవి. వీనిలో కొన్ని గ్రహములును, కొన్నిస్థాలీలును, కొన్నిచమసపాత్రలుగను యుండునట. గ్రహముల ఆకృతి ఒకవిధముగను, స్థాలి ఆకృతి మరియొకవిధముగను యుండును. చమసలనగ స్రుక్కు-జుహూ-ఉపభృత్-ధ్రువాయనువిగా నున్నది. (శ్రౌతమను ద్రావిడగ్రంథము) గ్రహములు: దధిగ్రహము, అంశాగ్రహం, ఐంద్రవాయవ్యగ్రహం, ఉక్థ్యగ్రహం, అన్తర్యామిగ్రహం ఇత్యాదులు, స్థాలీలు, అదిత్యస్థాలీ, ఆగ్రయణస్థాలీ, ధ్రువస్థాలి, ఉక్థ్యస్థాలీ, ఇత్యాదులు.

77 జ్యోతిశ్శస్త్రములు.
82 అగ్నిమారుతశస్త్రములు.

యజ్ఞములలో అధ్వర్యుగణ వ్యాపారమంతయు యజుర్వేదమంత్రములతోను హోతృగణ వ్యాపారమంతయు ఋగ్వేదమంత్రములతోను ఔద్గాతృగణ వ్యాపారమంతయు సామవేదమంత్రములతోను జరుగును. హోమములును ప్రేషలును యజుర్వేదములుగ నుండును. హోతచెప్పు ఋగ్వేదమంత్రములు శస్త్రములనబడును. ఔద్గాతృసామములు స్తోత్రములనబడును. బ్రహ్మచెప్పుమంత్రములకు స్తోమభాగము అనిపేరు. ఈ (77) & (78) సంఖ్యలు శస్త్రములు.

(78) (79) (80) (81) ఈ వాక్యములందు యజ్ఞీయవ్యాపారమునకు ప్రతిగరమనిపేరు. ప్రతిగరమనగ సామాన్యముగ బదులుపలుకుటయని స్ఫురించుచున్నది. యజ్ఞాంతిమభాగమందు హోతృగణము కొన్ని శస్త్రములజెప్పును. అంతట పృష్ఠస్తోత్రములగొన్నిటి ఔద్గాతృగణము గానము చేయును. తరువాత హోతతిరుగ కొన్నిశస్త్రముల బఠించును. ఆ సందర్భమున హోత అధ్వర్యువు నుద్దేశించి "శోంసావోం" అని పలుకును.

దీని అర్థము:—అధ్వర్యుడా. శస్త్రములజెప్పబోవుచున్నాను అని. అందుకు బదులుగా ప్రతిగా అధ్వర్యువు - "సోఘామోదఇవ" అనును. ఇట్లు ఈ సంఖ్యలలోని మాటలు వారిద్దరికి జరుగును. ఈ ప్రకరణమునకు ప్రతిగరమని పేరుగనున్నది.

(తైత్తిరీయ సంహితకాండ 3-2-9 చూడుము)

(83) (84) (85) కడపటిదినమున ప్రాతస్సవనకాలమునందును, మాధ్యందినసవనకాలమునందును తృతీయసవనకాలమునందును ప్రతిగరవ్యాపారము జరుగునటులున్నది.

(తై. స. 3-2-9 చూడుము.)

(86) అవభృథమనునది యజ్ఞములో కడపటివ్యాపారము, అపుడు యజమానుడు వానిపత్నియు ఋత్విక్కులందరును యజ్ఞపాత్రలనన్నిటిని తీసికొని చెరువనుండు తీర్థమునకు స్నానమునకు పోవుదురు. ఆస్నానమునకు అవభృథస్నానమని పేరు. వీరు తీసికొనిపోయిన యజ్ఞీయపాత్రలనన్నిటిని ఆ నీటిలో విడిచివేయుదురు. దీక్షకాలములో యజమానుడు కప్పుకొనుచుండిన కృష్ణాజినమును చాత్వాలమను యజ్ఞశాలలోని నీటిగుంటలో అతడు పారవేయును. లేదా వేదము చదువుకొనుచుండు బ్రహ్మచారి లభించినయెడల వానికిచ్చును.

(87) (89) అవభృథస్నానానంతరము యజమానాదులు అందరు యజ్ఞశాలకువచ్చి ఒకయిష్టిని జరుపుదురు. ఈ యిష్టిపేరు ఉదవసానీయేష్టి. యజ్ఞప్రారంభమున జరుపబడు మొదటియిష్టికి ప్రాయణీయేష్టి అనిపేరు. యజ్ఞాంతమున అవభృథానంతరము జరుపు యిష్టికి ఉదవసానీయేష్టి యనిపేరు.

(88) ఉదవసానయేష్టి అయినపిదప యజమానునిగృహమున నూత్నముగ యజ్ఞవేదికల నిర్మించి వానియందు గార్హపత్యాదిత్రేతాగ్నుల ప్రతిష్ఠింతురు.

(90) దర్శపూర్ణిమాదులయందు తప్పక యిష్టులు; జరిగింపవలయును.
దర్శ = అమావాస్య: పూర్ణిమా = పౌర్ణమి.

(సంపూర్ణము)



Telephone No. 2422
,, 2863—2446

Telegrams.
'PLEASURE'

బెంగుళూరులోనా ?

# శాస్త్రీస్ హోటల్‌లో బస చెయ్యండి

హోటల్ బృందావన్, హైగ్రౌండ్స్ హోటల్, రేస్‌కోర్సు యెదుట,

బెంగుళూరులో ఇదే అతి దర్జాయైన గొప్ప హోటలు ;

బస చేయుదగినది. పేరుకుతగ్గ ప్రాశస్త్యముగలది ఇదొక్కటే. ఒకమారు వచ్చి చూడదగినది.



నవీనమయిన అన్ని ఏర్పాట్లతోను, సౌకర్యములతోను అలరారు ఉత్తమ తరగతికి చెందిన గొప్ప వసతిగృహమిది. సువిశాలమయిన, బాగుగా గాలివచ్చునట్టి గదులు, స్నానములకు ప్రత్యేక గదులు, అతి నవీనమగు శానిటరీ ఏర్పాట్లును గలవు

ఫోన్ 2422

బ్రాంచ్:

శాస్త్రీస్ హోటల్, చిక్‌పేట్, బెంగుళూరు సిటీ.

చాలా మితమయిన రేట్లకు బాగుగా అన్నిసౌకర్యములు అమరియున్న విశాలమయిన గాలిగల గదులు. ఆంధ్రభోజనము ఒక ప్రత్యేక విశేషము.

ఇది చదవండి:

దివాన్ బహదూర్ డి. శ్రీరామశాస్త్రిగారు, ఎమ్. ఎల్. విశాఖపట్టణము, ఇలావ్రాశారు:

గతనెల 22 నుండి 24 వ తేదీవరకు మీ బృందావనం హోటలులో బసచేసియుండిన నేనున్నూ: మెసానిక్ అతిథులుగ వచ్చిన యితర మిత్రులున్ను ఇందుమూలముగా మా సంతృప్తిని, సంతోషమును మీకు తెలియపరచుచున్నాము. మేమున్న కొద్దిరోజులున్ను మీ నౌకర్లు మాయెడల అతిశ్రద్ధ ఆదరణచూపియుండిరి, మా అవసరములన్నింటిని జాగ్రత్తగా అమర్చియుండిరి మాకిచ్చినగదులు పరిశుభ్రముగానుండెను. భోజన ఫలహారాదులు సంతుష్టికరముగను రుచ్యముగనుఉండెను. మీ హోటలుకు సర్వసౌభాగ్య అభివృద్ధులను కోరెదను.

ఆంధ్రుల నవీన సర్వజనామోదమందిన హోటలు

**శాస్త్రీస్ హోటల్, చిక్‌పేట్, బెంగుళూరుసిటీ వారి నిర్వహణక్రింద ప్రారంభింపబడినది.**

# సత్ప్రవర్తన

శ్రీమతి లక్ష్మి అగస్త్యగారు

(నాల్గవతరగతి, ప్రెసిడెన్సికాలేజి)

సత్ప్రవర్తనని,మనం బి. య్యే. ఎం. ఏ. చదివినంతమాత్రమున అలవరచుకోలేము. కేవలం పుస్తకాల్ని చదవడంవల్లకూడా నేర్చుకోలేము. మనం అనుదినము ఎంతోమంది స్త్రీలతో కలిసిమెలిసి తిరగవలసి ఉంటుంది. తన్మూలంగా ఎంతోమంది స్త్రీలప్రవర్తనల్ని గమనించకలుగుతాము. వాటిలో మంచివాటిని గ్రహించి వాటిని అములులోపెట్టిన మనం సత్ప్రవర్తనని అలవాటు చేసుకున్నవాళ్లమౌతాము. సత్ప్రవర్తనకు తోడ్పడే కొన్నివిషయాల్ని కింద పొందుపరుస్తున్నాను. అవి చాలామందికి తెలిసినవే అయివుండవచ్చును. అయినా అవి మన సోదరీమణులకు చాలా తోడ్పడతాయనే ఉద్దేశంతో వ్రాస్తున్నాను.

ట్రాములోగాని బస్సులోగాని నువ్వువెళ్తూఉండగా ఎవరైనా ఉదారస్వభావుడైన పురుషుడులేచి తన స్థానాన్ని నీకిచ్చినప్పుడు అస్థలము నీజన్మహక్కు అన్నట్లుగా ఏమీ మాట్లాడక అతని వైపన్నా చూడకుండా చప్పునపోయి కూలబడక అతనివైపు కృతజ్ఞతాపూర్వకమైన దృక్కుల్నిపరపి మరీకూర్చో. ఆ లేచినపురుషుడు యువకుడైతే అతనికోరికను మన్నించి అతనిస్థలాన్ని కృతజ్ఞతతో ఆక్రమించు. అదే పురుషుడు ముసలివాడైతే అతనిస్థలాన్ని ఆక్రమించబోకు. ఆయనలేవబోతే నివారించి ఆయన మళ్లా కూర్చునేలాగున చెయ్యి.

మార్గాన్ని పోతున్నప్పుడు తప్పులోవని (కుడివైపు) వెళ్తూ నీకెదురుగుండా, సరియైన మార్గాన్నివచ్చే వారిని చేత్తో తోస్తూ వెళ్లడానికి ప్రయత్నించకు. అందువలన కొంతమంది మనస్సులలో చెడ్డఉద్దేశాల్ని కలిగించినదానివికూడా ఔతావు.

అనవసరం అయ్యేటంత ఎక్కువగా నగల్ని ధరించకు. తగుమాత్రం నగల్ని ధరించడంవల్లనే స్త్రీ సౌందర్యం ఇనుమడిస్తుందనే విషయాన్ని మరచిపోకు.

ఒక స్నేహితురాలితో మాట్లాడుతున్నప్పుడు "ఫలానా ఫలానా ఆమె ఇలాగచెప్పింది." అనేటం దుకుబదులుగా ఆ ఫలానా ఆమె మీఇద్దరికి ఆప్తమిత్రమయ్యిందంటె, ఆమె పేరుచెప్పి ఆమె ఇలాగ చెప్పిందని చెప్పడం చాలా ఉత్తమం.

విందుకైనా మీటింగుకన్నా వెళ్లేటప్పుడు ఎప్పుడూ నిర్ణీతసమయాని కన్న ఆలస్యంగా వెళ్లకు. అందువల్ల నీకేమి ఘనతరాదు. పైపెచ్చు నీమర్యాద తగ్గుతుంది.

సేవకులతోగాని, నీకంటె హీనస్థితిలో వున్నవారితోగాని మెలిగేటప్పుడు మోటుగాగాని, కటువుగా గాని, అతిచనువుగాగాని ప్రవర్తించకు. నీ హోదాన్ని నిలవబెట్టుకుంటూ దయతోప్రవర్తించు. అందు వల్ల వాళ్లమర్యాదని, గౌరవాన్ని తప్పకండా పొందగలవు.

ఇంట్లో వున్నప్పుడు మురికి గుడ్డల్ని ధరించి ఎక్కడైనా బైయటికి వెళ్లేటప్పుడు మాత్రం పరిశుభ్రమైన దుస్తుల్నిధరించడ మనే ఆచారాన్ని విడచిపెట్టు. ఎప్పుడూ పరిశుభ్రమైన దుస్తుల్ని ధరించు స్నేహితులు నిన్ను చూడడానికి వచ్చినప్పుడు వేరేదుస్తుల్ని ధరించడానికి గదిలోకి పరుగెత్తకు.

ఎవరితోటి చిర్రుబుర్రు మనకు. బహిరంగప్రదేశాలలో ఇతరులతో దెబ్బలాడుటగాని వాదించుట గాని చేయకు. ఇతరులగురించి మాట్లాడేటప్పుడు వాళ్ల పేర్లు బైటపెట్టకు. వారిమిత్రులెవరైనా నీసంభాషణ వినడం సంభవించవచ్చును.

వీధిలో తినకు. గోళ్లని మురికిగాఉంచకు. మురికిబట్టల్ని నీదగ్గర చేరనీయకు. అనవసరంగా అధికంగా ఘాటైన సెంటును ఉపయోగించకు.

ఎవరయినా మాట్లాడుతున్నప్పుడు అడ్డుతగలకు. సంభాషణను సాంతంగా ప్రశాంతంగావిను.

వీధిలో వెడుతున్నప్పుడు ఇతరుల్ని ఆకర్షించేటట్టుగా పోజుచూపకు. బిగ్గరగానవ్వకు.

చేతి పదివేళ్లకి పదివుంగరాలు వేసుకుంటే అందంగావుంటుందని అనుకోకు. అందువల్ల నగల అందంగాని వేళ్లసొంపుగాని బహిర్గతము కాదు. ఎంతతక్కువ వుంగరాల్నిధరిస్తే అంతచక్కగా కనబడుతుంది. ఉంగరాలఅందము, వేళ్లఅందమూ.

నీభర్తతో బస్సులోనైనా ట్రాములోనైనా వెళ్లేటప్పుడు అతనితో అతిచనువుగా ప్రవర్తించకు. అతనుకూడా అతిచనువుగా ప్రవర్తించేలాగ చెయ్యకు.

భోజనముచేసినతర్వాత పళ్లెమును దూరంగా తోసివేయకు.

విందుకు వెళ్లినప్పుడు కులాసాగా మాట్లాడు. మూతిముడుచుకొని కూర్చోకు. అలాగని నువ్వు తింటూవున్న వస్తువల్నిగురించి అధికంగా విమర్శించకు. పెట్టిన తినుబండారాల్ని అన్నింటిని తినివేయక కొంచెము ఆఖరున మిగుల్చు. ఏదైనాతినుబండ రెండోసారికావలిస్తే నీయంతట నీవు అడగకు, వాళ్లు రెండో సారి ఇస్తేతిను; లేకపోతే మానేయి.

నీలోకాని యితరులలోకాని నిర్లక్ష్యప్రవర్తన సత్ప్రవర్తన సూచిస్తుందని ఎప్పుడూ అనుకోకు.

నలుగురితో మాట్లాడేటప్పుడు నీరుగ్మతను గురించిగాని నీలోపాల్ని గురించిగాని తెలియజేయకు.

అనవసరంగాగాని అమర్యాదగాగాని మాట్లాడకు. పరిశుభ్రమైన కోకనుకట్టుకొని, మురికిజాకెట్టుని ధరించకు. అందువల్ల నీకు పరిశుభ్రత తెలియనట్లుగా లోకానికి తెలిసిపోతుంది.

ఇతరులతో మాట్లాడుతూఉన్నపుడు చేతిగాజుల్ని ఇటూ అటూ కదపడం, ఎప్పుడుచూచినా పైట సవరించడం, కొప్పులోని పువ్వుల్ని సవరించడం, చెవుల్లోవేలాడున్న లోలాకుల్ని స్పృశించడం, ముక్కుపుడకని చేతితో త్రిప్పడం, గోళ్లని కొరకడం, నీచీరవైపు అప్పుడప్పుడు చూచుకోవడం, చేతుల్నిగాని తలనిగాని అధికంగా ఆడించడం, నీజడని భుజానికిపైగా ముందుకితీసుకువచ్చి రిబ్బనువిప్పి ముడివేయడం, నీ చీరచెంగుకొనని చేతితోపట్టుకుని నలుపుట, వెనక్కి ముందికి వూగటం, అనవసరంగా నవ్వడం, చప్పట్లు కొట్టడం, ఇతరుల్ని వేలితోచూపడం, ఇతరస్త్రీలను ఎగతాళిచేయడం, నీమెడలోవున్న బంగారుగొలుసుని అప్పుడప్పుడు చేతితోస్పృశించడం, అప్పుడప్పుడు చేతిగడియారాన్నిచూడడం ఇలాంటివిచేయకు.



# మధురవాణి

శ్రీ నిడదవోలు వెంకటరావుగారు ఎం.ఏ.

రఘునాథనాయకుని కాలమున విలసిల్లిన కవయిత్రులలో మధురవాణి మకుటమని చెప్పనొప్పును. ఈమె సంస్కృతమున రచించిన రామాయణకావ్యము సుందరకాండమువఱకు 14 సర్గలుగల భాగము లభించినది. తెలుగున నీమెరచించిన కృతులు లభింపలేదు. కాని యీమె సంస్కృత ప్రాకృతాంధ్ర భాషలలో ప్రఖ్యాత కవయిత్రియై రఘునాథ భూపాలునిచే స్వర్ణాభిషేక మహాగౌరవమునొందినదని యీమె గద్యములవలన తెలియుచున్నది.

తత్తాదృక్ ఘటికార్థ నిర్మిత శతశ్లోకీ ఫణీగ్రామణీః
వాణీ ప్రాకృత శాస్త్రనైపుణ సమున్మీల ద్యశః శ్రీజుషా
దేవోద్యన్మతి సఖ్యయా మధురవాణ్యాంబాఖ్యయా నిర్మితే
శ్రీరామాయణసార కావ్యతిలకే సర్గస్తృతీయో భవత్.

ప్రస్తారాభి నవాత్త వృత్త కవితా ధాటీ కథాశుక్రియా
షడ్భాషారచనా విశేష బహుధా విఖ్యాత కీర్తి శ్రియా
దీవ్యోద్యన్మతి ... ... సర్గస్తురీయోఽగమత్.

వీణా వాదకళా వినోద సమయే ధృత్వా సమస్యాః శతం
సద్యస్సంసది సాధుపూర యతియా దత్తా కవీంద్రైస్తయా
దీవ్యోద్యన్మతి ... ... సర్గోఽభవత్పంచమః.

ప్రఖ్యాతార్జవ యా పదార్థ గమక వ్యాఖ్యాన పక్షాన్వయ
ప్రాగల్భ్యాస్పద నైషధ ప్రతివిధాసానంద సూరీంద్రయా
దీవ్యోద్యన్మతి ... ... సర్గోఽత్రషష్ఠోఽభవత్.

సద్యోవిస్మయకృ నిరోష్ఠ్య కవితా సంగర్భ ధారాసుధా
సారోర్మి పరిపూరిత శ్రుతి సుధీ సంభావితాభి ఖ్యయా
దీవ్యోద్యన్మతి ... ... సర్గోఽజనిష్టాష్టమః.

మాధుర్యైక ధురంధ రాంధ్రకవితానిర్మాణ సమ్మాన్యయా
దీవ్యోద్యన్మతి సఖ్యయా మధురవాణ్యాంబాఖ్యయా నిర్మితే
శ్రీరామాయణ సారనామని మహా కావ్యేతి భవ్యేసుధీ
వర్గోల్లాస విశేషధామ్ని నవమస్సర్గో మనోజ్ఞోఽభవత్.

సూరిస్తవ్య కుమారసంభవ మహాకావ్య ప్రతిగ్రంథన
ప్రాగల్భ్య ప్రకటశ్రియా పదసదః ప్రఖ్యాత వైదుష్యయా
దీవ్యోద్యన్మతి ... ...దశమస్సర్గోఽత్ర కావ్యేఽభవత్.

ప్రౌఢ శ్రీ రఘునాథ నాయక కృత స్వర్ణాభిషేక క్రియా
దీవ్యోద్యన్మతి సఖ్యయా ... ... సర్గస్తథైకాదశః.

రఘునాథుడు రచియించిన తెనుగురామాయణము నా స్థానములో విదుషీమణులు పఠించుచుండగా నొకనాడాతడు తన యాంధ్రరామాయణమును సంస్కృతీకరింపగల కవయిత్రు లెవ్వరైనగలరాయని ప్రశ్నించెనట. ఆ ప్రశ్నకు బవాబుగా శ్రీరామచంద్రమూర్తియే రఘునాథునికి స్వప్నములో దర్శనమిచ్చి, యిట్లు చెప్పెనట.

చతుర మధురవాణీం సమ్యగాకర్ణయస్వాః
సరసి మధురవాణీ నామదత్తం త్వయైవ
సరస కృతివిధాయాం సాధుమేధా విశేషా
స్వధిక చతురశేషా స్వాంబుజాక్షేషు సైషా".

"నీచే మధురవాణియను బిరుదముపొందిన మేధావతి, సరసకృతి నిర్మాణనైపుణిగల కవయిత్రిగలదు." ఆమెచే నీ గ్రంథము రచితమైన దివ్యముగనుండుననిచెప్పి యంతర్హితుడయ్యెను. రఘునాథుడును నామెను బిలిపించి రామాయణమును సంస్కృతీకరించుట కాజ్ఞయొసగెను.

రఘునాథుని రామాయణముకూడ మనకు పూర్తిగ లభ్యముకాలేదు. నాలుగాశ్వాసముల గ్రంథము. గ్రంథాదినుండి దొరకుచున్నది. (రఘునాథరామాయణము అను పేర ప్రకటితమైనది. ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకటితము, కాకినాడ.) దొరకినంతవఱకు సంస్కృతాంధ్ర రామాయణములను బట్టిచూడగా తెలుగు కన్న సంస్కృతమున కొంతవిస్తృతికలదని చెప్పనొప్పును. మధురవాణి తెలుగు కవయిత్రి గావున యచ్చ టచ్చట యతిమైత్రి పాటించినది. మంగళ శ్లోకములో

శ్లో॥ లక్ష్మీం దిశేల్లక్ష్మణ పూర్వజన్మా
వీరోరఘూణామ్ విజయం ప్రయచ్ఛేత్
ఆరోగ్యమర్కాభి జనశ్చదద్యాత్
రతీశమూర్తే రఘునాథ నేతుః.

శ్లో॥ ప్రకృతి మధురకావ్య ప్రౌఢ సందర్భ విద్భి
ర్భువతి జనమణీభిర్యుక్త పార్శ్వద్వయోఽసౌ
అథసవిధ ముపేతాం సౌహృదాహ్వాయ మన్మా
మవని పరిదృఢానా మగ్రణీ రిత్యభాణీత్.

శ్లో॥ అజహా దలంకృతి క్రమ మనేకరసోల్లసితమ్
సరసపదార్థ సంగతి సమగ్రగుణానుగుణమ్
రఘురమణ ప్రబంధతిలకం రసికాభిమతమ్
సుదతి విధీయ తామితి సుధీరగదీన్నృపతిః.

ఇట్లే యతులు పాటింపబడినవి. పైయుద్ధృతాంశములబట్టి యీమె యాంధ్రభాషాకవితా పాండిత్యము నూహింపనగును.

(భారతి ధాతమార్గశీర్షమున ప్రకటితమైన శ్రీరామకృష్ణ కవిగారి మధురవాణి అను మధురవ్యాస మిందు కుపజీవ్యము.)

—★—

# గృహలక్ష్మికి పద్యరత్నాలు



కల్లూరు అహోబలరావుగారు



(ఏప్రిలు సంచిక తరువాత)



భక్తి కరంబగు పాటల రక్తిని మృదుమధురమైన రాగముతోడన్
శక్తికొలందిగ బాడిన ముక్తిని శ్రీశుండొసంగుబో; గృహలక్ష్మీ!

ఒదిగిన సత్సాంగత్యము యొదిగిన నుత్సాహబలము నోర్పును సిరియున్
చదువుము నున్నత విద్యలఁ జదువుకు సుగుణంబుపట్టు జయగృహలక్ష్మీ!

పాటిగఁజూచిన నందఱు కూటికిఁజదివెదరు; దీనగోరంతయు, మేల్
వాటిలదు; మేటివిద్యకు బోటులు యత్నింపవలయుబో; గృహలక్ష్మీ!

స్వాతంత్ర్యమహాభానుడుఁ చేతోమోదంబుగాగఁ జెలగుచునుండన్
భీతిల్లుచు పరభాషలు వేతరలె స్వదేశములకు విను గృహలక్ష్మీ!

కావున, నింగ్లీషునకై జీవితమును ధారబోయఁజెల్లదు; మదిలో
భావించి మాతృభాషలఁ బ్రావీణ్యము నందవమ్మ; వరగృహలక్ష్మీ!

హిందీ సంస్కృతభాషల కెందును ప్రాశస్త్యమబ్బె; నిదితలచియు, సా
నందము ప్రేమలు వెలయన్ హిందీసంస్కృతము నేర్వుమీ; గృహలక్ష్మీ

తెలుగుందల్లికి నిలయము వెలసెడు రోజులు బిరాన వేంచేసెను; యా
జిలిబిలి పలుకుల ముద్దుల కలికిని మఱవంగ వలదుగా; గృహలక్ష్మీ!

తెలుగుందోటలో పూవులు కళకళరాజిల్లి నీదుకనుగవ కెదురన్
తొలుకాడు; వాటిసౌరభముల ముదమారంగ గ్రోలు మో గృహలక్ష్మీ!

కుట్టుపనులద్దకంబులు అట్టలపను లల్లకంబు లాకులకుట్టుల్
నెట్టన నేర్వగ వలయును పెట్టని భూషణము లివ్వి ప్రియగృహలక్ష్మీ!

ఇంటి సవరింపు యేమను కొంటివా? యేవస్తువెచట కుదురుగనున్నన్
కంటి కలంకారమొ వాల్గంటీ! తెలియంగ వలయుగా గృహలక్ష్మీ!

గృహశృంగారము నేర్వుము గృహిణివియై భర్తగృహము గైసేయవలెన్
అహరహము దల్లికడనే సహనపు పారములనోర్వజను; గృహలక్ష్మీ!

(సశేషము)

# ఏటిమాట ఆలోచించారా....

## ★ సమష్టి కుటుంబము...

## ★ వ్యక్తుల బాధ్యతలు...

★ శ్రీమతి యం. సుశీలగారు

1. మనకుటుంబాలలో నిత్యము కనిపించే గృహచ్ఛిద్రాలకి మూలకారణం సమష్టి కుటుంబాలే అంటానండి. లేకపోతే ఈ అత్తాకోడళ్ల పోట్లాట, అన్నదమ్ముల వైరాలు ఎక్కణ్ణించి వస్తాయంటారు?

2. గృహచ్ఛిద్రాలను మనస్సులో పెట్టుకొని, సాంప్రదాయ సిద్ధమైన, హైందవ నాగరికతా చిహ్నమైన, సమష్టికుటుంబాన్ని, కూకటివ్రేళ్లతో, పెల్లగించి వేయాలని మీరంటున్నారు. కాని, నేను మాత్రం, మీతో ఏకీభవించను.

1. బహుశ మీరు సమష్టికుటుంబ బంధాలు లేనివారేమో! ఎంతేనా అదృష్టవంతులమ్మా?

2. ఒకరినొకరం జప్పిపాడుచుకుంటూనో, పొగడుకొంటూనో వుంటే సరిపోదు. మనుష్యులలో కలిగిన, సమస్యకి, సరియైన సమాధానం చెప్పుకుంటే, మంచిదంటాను. ఎందుకంటే, తాత్కాలికంగా కల్గిన, మనో వేదనతో, ఒకసంస్థను, కూలనాడవద్దని, నాప్రార్థన. సమష్టికుటుంబపు, పుట్టుపూర్వోత్తరాలు తెలుసుంటే, నిజంగా, మనసంస్థగురించి, మీరెంతేనా, గర్వపడతారు.

1. పుట్టుపూర్వోత్తరాలు నాకూ తెలుసునండీ, ఏనాడైతే మానవుడు పశులకాపరిస్థితినుండి పాలికాపైనాడో ఆనాటినుంచి ఈసమష్టికుటుంబం, స్థాపితమైంది. మాధవుడు ఆకుటుంబానికి పెద్ద ఐనాడు. యజమాని ఐనాడు. కుటుంబయాజమాన్యం తననెత్తిన వేసుకొని కుటుంబ సుఖదుఃఖాలలో భాగస్వామి ఐనాడు. ఆయజమానితోబాటు యజమానురాలు కూడా పెత్తనం దారైంది, కొంతమట్టుకు.

2. ఆఁ! ఔనా! దానివల్ల ఎంతలాభము ఉందో, గమనించారా! అసలు, సమష్టిఅంటే, అర్థం తెలుసుకుంటే, సమష్టికుటుంబం, సంస్థ, అర్థంచేసుకోగలం. చిన్నప్పుడు, మనం, తెలుగుపుస్తకాల్లో ఒకకథ చదువుకున్నాము. ఓతండ్రి వుంటాడు. అతనికేమో, చాలామంది కొడుకులుంటారు. అందరూ అనునిత్యం కీచులాడుకొనేవారు. ఓనాడుతండ్రి. ఈభ్రాతృవైరాన్నిచూసి ఒకపుల్లలకట్టతీసికొచ్చి, ఒక్కొక్క కొడుకుని పిలచి 'నాయనా! ఈపుల్లలకట్ట విరవరా' అని అడిగాడు. ఒక్కడుకూడా, పుల్లలకట్ట విరవలేకపోయాడు. అప్పుడు తండ్రి 'నాయనలారా! చూశారా! కట్టగాకట్టిన పుల్లలకట్టనుమీలో, ఎవరూ, విరవలేకపోయారు. పుల్లలన్నికలసి, మీబలాన్ని ధిక్కరిస్తున్నాయి. అందుచేత, ఈపుల్లలకట్టని చూచేనా, ఐకమత్యంగా ఉండడం నేర్చుకోండి.' అనిసూచా, గుణపాఠం నేర్పాడు. ఈకథలోనే, ఇమిడివుంది, తరతరాలనుండీ, సాంప్రదాయంగా, సజీవంగా ఉన్న, మన హైందవ, సమిష్టికుటుంబం, ఒక్కచీనావారిలోనూ, హైందవులలోనూ తప్ప, మరి, ఇతరత్ర ఎక్కడా, ఏసంఘంలోనూ, ఈసమష్టికుటుంబ, సంస్థ, కనిపించదు. సంపాదించినధనం, యజమానికిస్తారు. యజమాని కుటుంబాన్ని సరిదిద్దుతాడు.

1. ఔనమ్మా! అంతా బాగానేవుంది. కాని, వ్యక్తినశించిపోతాడు. వ్యక్తిస్వాతంత్ర్యపు దినాలివి. నీవుచెప్పినట్లు సమష్టికుటుంబం, ఒకానొక మానవ పరిణామదశకు చాలా ఆవశ్యం. ఎందుకంటే, కుటుంబం, ఒకతేనెపట్టులా అందులో, కుటుంబీకులు అంటిపెట్టుకుని ఉండవలసిన రోజులివి. కాని ఈశతాబ్దంలో వ్యక్తిముఖ్యం. తర్వాత కుటుంబం, సమష్టికుటుంబంలో ప్రతిభగల వ్యక్తినశించిపోతున్నాడు. సోమరులు తయారవుతున్నారు.

2. పాశ్చాత్యనాగరికతావాసనతో, వ్యక్తిత్వం, వ్యక్తిస్వాతంత్ర్యం అనిమాట్లాడుతున్నారు. నిజమే పాశ్చాత్యసంఘంలో సమష్టికుటుంబం వాటినుండి కల్గేసమస్యలు వేరు. మనకుటుంబాలలో అతి.బాల్య వివాహాలవల్లా, తదితరకారణాలవల్లా ఎంతోమంది వితంతువులున్నారు. మీరుచెప్పినట్లు, వ్యక్తిస్వాతంత్ర్యం ముఖ్యమైతే సమష్టికుటుంబం, లేకపోతే, వితంతువులగతేంకాను. ఈసంగతి ఆలోచించారా? మన సంఘంలో స్త్రీ వారసత్వపు హక్కుకలదికాదు. తర్వాత కుటుంబంలో, చాలా తక్కువ ధనోపార్జన కల వారుంటారు, వేరేకాపరం 25 రూపాయలు సంపాదనతో, నలుగురు పిల్లలతో పెట్టగలరా? సమష్టిగా వుండి యజమానికి, చేదోడు వాదోడుగా వుంటే, వేరే, కుటుంబకర్చు, వుండదుగా. సుఖంగా వుండొచ్చుగా?

1. ఈసమస్యలన్నీ పరిష్కరించబడుతున్నాయి. స్త్రీకి కూడా వారసత్వపుహక్కు ప్రభుత్వం కల్గచేస్తుంది.

2. సంతోషమే. కాని సమష్టికుటుంబంలో యుండే, గౌరవమర్యాదలు మరే సంస్థలోనూ కనిపించవు. తర్వాత జీవితంలో కావలసింది త్యాగము. కుటుంబంకోసం త్యాగం చేయగలవాడు, దేశంకోసం ఇతరులకోసం త్యాగంచేయగలడు. సమష్టికుటుంబం లేనినాడు, మానవుడు స్వార్థపరుడౌతాడు. మమతా, మమకారం, ప్రేమ, వాత్సల్యం చంపుకుంటాడు. నావాదం ఒకటి - ప్రస్తుత పరిస్థితులకు అనుకూలంగా, వుండేలా, పాతసంస్థలను, మార్చుకోవాలి. అంతేకాని, వాటిని, మూలనాశనం చేయకూడదు. ఎందుకంటే ఆసంస్థలు, మనవ్యక్తిత్వాన్ని, ప్రపంచంలో తెలియపరుస్తాయి.

1. మనకుటుంబాలలో అనునిమిషం అపశృతి పల్కుతూనే వుంటుంది. ఇది సమష్టిగా వుండడంలోనే పెద్దలోపం అనుకుంటాను. సమష్టికుటుంబంలో వ్యక్తిత్వానికి స్థానం లేదు. ‘ఇది నాకుటుంబం. కుటుంబమర్యాద. సాంప్రదాయంలో పేరుప్రతిష్టలే నాకుముఖ్యం కాని, నీవ్యక్తిత్వం నాకుముఖ్యంకాదు.’ అని కుటుంబానికి చెందిన ప్రతివ్యక్తి ఆదర్శప్రాయంగా జీవిస్తేనే సమష్టికుటుంబం సౌఖ్యప్రదంగా వుంటుంది. కాని సమష్టి కుటుంబతత్వాన్ని నేడు, మన తత్వశాస్త్రం పటాపంచలంచేస్తుంది. దానికి కారణం నేటి నాగరికతే. మానవుడు విజ్ఞానవంతుడవుతున్నాడు. ప్రతిచిన్న విషయాన్ని తర్కదృష్టితో పరిశీలిస్తున్నాడు. వాంఛలు ఎక్కువవుతున్నాయి. తనవ్యక్తిత్వం కోసం సమస్తాన్ని త్యాగంచేస్తున్నాడు. తన చుట్టూ నైతికంగా గోడలుకట్టుకుంటున్నాడు. అటువంటప్పుడు ఔదార్యానికి సాంప్రదాయాలకీ స్థానం యెక్కడుంటుందండీ?

2. మీరు చెప్తూన్నదాంతో పూర్తిగా ఏకీభవించలేనండీ. కారణం మీరుసంస్థని రద్దుపరచాలంటారు. నేనుమరామత్తుచేసి నిల్పుకోవాలంటాను.

1. కుటుంబానికి తండ్రి పెద్దగా వుంటారని మనకి తెలిసిందే. కుటుంబభారం మోసేవారికి శ్రమ వుండదు. కారణం మానవుడు కాబట్టి, అప్పుడు నియంత క్రింద ప్రవర్తిస్తాడు. తర్వాత మీరేదో కుటుంబంలోనివారంతా సంపాదిస్తారు. అదంతా పోగుచేసి సుఖంగా అందరూ అనుభవిస్తారుఅని అన్నారే, నేనుమాత్రం వప్పను. సమిష్టికుటుంబంలో వుండేవ్యక్తులు బాధ్యతా రహితుల క్రింద తయారౌతారు, సోమరితనానికి లోనై భావిజీవితరంగానికి ఎందుకూ పనికిరాని వారిక్రింద తయారవుతారు.

2. కాని నేడు ఎటుచూసిన సమష్టితత్వ ఆవశ్యకతగూర్చే ప్రయత్నాలుజరుగుతున్నాయి. రాజ్యాంగంగా యావత్ మానవజాతిని ఒకసమష్టి కుటుంబంక్రింద చేయాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి. సంస్థలప్పుడే యేర్పడ్డాయి.

1. అవును! మన సమష్టికుటుంబంతో అసంస్థలని సరిపోలుస్తున్నారా?

2. తప్పక! మీరెన్నిచెప్పండి, సమష్టికుటుంబం, భావిజీవితరంగంలో, సుఖంగా, జీవించేందుకు తయారుచేసే, రంగస్థలము.

A. I. R. అనుమతిని.

# ◎ చంద్ర గ్రహణం అనుభవాలు ◎

శ్రీమతి వు. సరోజినిగారు

●

గ్రహణమని ఏమియుతోచక బీచికి పోవుటకు బయలుదేరాను. వెంటనే మాచెల్లెలు, తమ్ముడు, ఇద్దరుబయలుదేరారు. వీరు వస్తామనేసరికి నేను ముగిద్దామను కుంటూవుండగా అన్నయ్య బాబాయి, ఇద్దరు ఆఫీసునుండివచ్చి బయలుదేరారు. అంతకు ముందే మేము రెడీగా యున్నాము. వెంటనే అయిదుగురము కలసిమాట్లాడుకొంటు కొంతదూరం నడిచాము. గ్రహణమని యింట్లోకాఫీ గూడా లేవాయె. అన్నయ్యా, బాబాయి, ఇద్దరు ఇంట్లోకాఫీ అడిగితే అమ్మ ఈవేళగ్రహణముగదా కాఫీ ఏమిటరా అని అంటుందని భయం; అందుకని తమాయించుకొని సగందూరం. వెళ్లిహోటలుకు పోదా మన్నారు. సరేనని అయిదుగురము వెళ్ళితిరిగి తిన్నగా బయట పడ్డాము. అక్కడనుండి మెల్లగా మెరీనాదారి పట్టాము. పోయి ఒడ్డున కూర్చున్నాము.

మెరీనా అనగానే శరీరము పులకరిస్తుంది. జనము గుమిగూడి యున్నారు. అంత జనమును ఒక్క ఆదివారం పూట తప్ప మరెప్పుడూ చూడలేదు. ఆదివారము గూడ చూడలేదేమో! జనము క్రిక్కిరిసి యున్నారు. నిండుచంద్రుడు తనను లోబఱచుకొనుటకు వచ్చుచున్న కేతువునుచూచి ముఖం మాడ్చుకుంటున్నాడు. కొంతసేపయిన తర్వాత ఎటుతిరిగి కేతువు: చంద్రుని లోబఱచుకొన్నాడు. సముద్రతరంగముల మీదపడుచున్న చంద్రకిరణములు మెరయుచున్నవి. కెరటములకు కూడ అలజడి హెచ్చుచున్నది.

మాకంటే మించినవారెవరన్నట్లు, అట్లుండె నేని తమతోపోటికి రమ్మని తొడలప్ప ళించినట్లు, అలలు మీదిమీదికి వస్తున్నవి. భరతమాత అనుంగుబిడ్డలుమాత్రము సామా న్యులా! మేమున్నామంటూ యుద్ధములోనికి పోవుసైనికులు లాగా ఆకెరటములతో యుద్ధము చేయుటకు పోయినట్లు పరుగుగా పోయి ఆ అలలను కౌగలించు కొంటున్నారు. నాకుమాత్రము చంద్రుడుతన్ను కేతువుమింగుచున్నను వీరి ఆటలుచూచి నవ్వుతున్నట్లు కనిపించాడు. అట్లాగా గ్రహణ స్నానాలు కూడా గడిచి పోతున్నాయి.

ఒకవైపున రేడియో ఎదో ఆలాపిస్తూంది. ఇంత ఆనందము వీటినేచూచి కలుగు చుండగా రేడియోగోల ఎవరికి కావాలి! ఒకవైపున సముద్రస్నానాల్లో మునిగి తేలుతున్న ఆస్తికుల మంత్రాలగొడవలు, మఱియొక వైపున స్నానాలుచేసి చంద్రునిత్వరగా వదలమని దీపారాధనచేయుచున్న ముత్తైదువుల నమస్కారములు, చల్లనిగాలి, యింతకన్నా ఆనంద మేమికావలయును! ఆవింతలన్నిటిని చూస్తూ అట్లాగే యుండిపోయాము. మాతమ్ముడు, అన్నయ్య బాబాయి మాత్రము గట్టుమీదే యుండిపోయారు. నేను మాచెల్లెలు

మాత్రం నీళ్ళలోకి పోయాము. నీళ్ళుమాత్రము మాకాళ్ళవఱకే వచ్చిపోయాయి. ఆమాటే మఱచి మేమేదోకబుర్లు చెప్పుకుంటూ అట్లాగే యుండిపోయాము. కాని ఒక అలపరుగెత్తుకుంటు వచ్చి మామోకాళ్ళవఱకు బట్టలన్నింటిని తడిపి మేమెక్కడ పట్టుకొనెదమో యనితిరిగి సముద్రములోకి పరుగెత్తింది. మాకప్పుడు చలనం వచ్చింది. ఇద్దరము ఒడ్డునకు వచ్చి మా అన్నయ్య వాండ్లతో మాట్లాడుతుండగా మరియొక అల వచ్చి నడుములవరకు తడిపి పోయినది. వారందఱు అల రావటము చూచిపరుగెత్తిన మా ఓటమికి నవ్వారు. మాకప్పుడు వారినేమిచేయుటకు తోచిందికాదు. కాని అప్పటి కోపం అణచుకొన్నాము.

కొంచెంసేపయిన తర్వాత చంద్రుని కేతువు వదలిపెట్టేడు. తన ఎప్పటి చిరునవ్వు ముఖముతో పూర్వంకంటే అందగా ప్రపంచాన్ని చూచుట మొదలెట్టేడు. చంద్రుని ముఖంచూచి అందరుసంతోషంతో యిండ్లకుపోయి కడుపారాభోజనంచేయుటకు బయలు దేరారు. మేముకూడ బయలుదేరాముగాని నాకుమాత్రం యింటికిపోవుటకు మనసొప్ప లేదు. యింటికిచేరి భోజనాదులుతీర్చుకొని పడుకొన్నామనిపేరేగాని నామనస్సులో కెరటాలు ఆసముద్రకెరటాలనుమరచిపోలేదు. ఇంకను ఆఆనందాన్ని నేనుమఱువలేదు. మరువలేనేమో! ఇంక సెలవు. సూర్యగ్రహణం తొంగిచూస్తూంది. ఆ అనుభవాలెట్లుంటాయో!

# పాలు, పాలద్రవ్యములు

"రాము"

ప్రకృతిలో నత్యుత్తమమైన ఆహారము పాలు. ఆహారములో ముఖ్యముగా ఉండవలసిన మాంసకృత్తులు, నీరు, లవణములు, క్రొవ్వులు, పిండిపదార్థములు, విటమిన్లు అన్నియు పాలయందున్నవి. ఆవుపాలు మన నిత్యాహారములో ముఖ్యపాత్ర వహించుచున్నది. ఇది వివిధ పదార్థములు మిశ్రితమై యున్న తెల్లనిద్రవము. పాలకు తెలుపురంగు దానిలోని క్రొవ్వువలన గలుగుచున్నది.

క్రొత్త పాలను కదలింపక ఒకచోట యుంచినయెడల దానిలోని క్రొవ్వుకణములు పైకితేలి ఒక మీగడమాదిరిగా ఏర్పడును. ఈ తెల్లనిపొరను తీసివేసిన నీరువంటిద్రవము మిగులును. పాలసరఫరా సంఘమువారు ఇంటింటికి పంచిపెట్టుటకు పాలను పెద్దపాత్రలో ఉంచుదురు. చాలసేపు ఆవిధముగానే ఉండిన పాలలోని చిక్కని క్రొవ్వుఅంతయు పైకితేలును. తత్ఫలితముగా పాలు మొదట పోయించుకొన్నవారికి చిక్కనిపాలు, తర్వాత వచ్చినవారికి పల్చని నీళ్లపాలు లభించును. అందువల్ల పాలు కొనుటకుముందు పాత్రలోని పాలు బాగా కలియబోయించి కొనవలెను.

ఆవుపాలు, తల్లిపాలు (Mother's Milk) ఒకే ద్రవ్యములనే కలిగియుండును. కాని ఆవుపాలలో మాంసకృత్తులధికము. తల్లిపాలలో చక్కెర ఎక్కువగానుండును. అందువలన ఆవుపాలు శిశువు సులభముగా జీర్ణించుకొనలేదు. అందులకే ఆవుపాలతో శిశువును పెంచునపుడు, ఆవుపాలకు నీరుకలిపి పల్చనగా నుండునట్లుచేసి చక్కెరకలిపి శిశువునకు పట్టెదరు. ఈ దిగువన తల్లిపాలతో ఆవుపాలు పోల్చబడి యున్నది.

| పదార్థములు | తల్లిపాలు నూటికి | | ఆవుపాలు నూటికి | |
|---|---|---|---|---|
| నీరు | 87½ | పాళ్లు | 87 | పాళ్లు |
| మాంసకృత్తులు | 2.3 | ,, | 3½ | ,, |
| క్రొవ్వులు | 3.8 | ,, | 3.8 | ,, |
| పాలచక్కెర | 6.1 | ,, | 4.9 | ,, |
| బూది | 0.3 | ,, | 0.8 | ,, |

ఆవుపాలలోను, తల్లిపాలలోను క్రొవ్వు సమానముగానున్నది.

ఆవు పాలయొక్క శ్రేష్ఠతను క్షీరమాపకము (Lactometer) తో నిర్ణయించుట కష్టమయినపని. అప్పుడే పిండిన ఆవుపాల సాంద్రత 1 027 నుండి 1.034 వరకుండును. మీగడతీసిన పాలసాంద్రత అధికము-దాదాపు 1.035 ఉండును. అందువలన కొంత నీరుకలిపిన మీగడతీసినపాలు అప్పుడే పిండిన ఆవుపాల సాంద్రతనే కలిగియుండునట్లు చేయవచ్చును. అందువలన క్షీరమాపకముతో పాలు మంచిదా కాదాయని తెలిసికొనలేము. ఆవుపాల సంఘట్టనము (Composition) తెలిసికొన్న అది మంచిదో కాదోయని నిర్ణయింప వీలగును. శ్రేష్టమయిన ఆవుపాలలో క్రొవ్వులు నూటికి 3 పాళ్లు ఉండితీరవలెను.

అన్ని ఆహారములకన్న పాలతిశీఘ్రముగా దోషయుతమగును. అంటువ్యాధుల నరికట్టుటకు మొట్టమొదట పాలకు ఏమాత్రము మలినము సోకకుండగ తగుజాగ్రత్త తీసికొనవలెను. అనేక శతాబ్దములనుండి మానవునికి బానిస యగుటచేత ఆవు, ముఖ్యముగా మనదేశములో, అతి బలహీనమైన జంతువుగా పరిణమించినది. ఈ కారణముచే మనదేశములోని గోవులు క్షయవ్యాధికి లోనగుచున్నవి. ఈ రోగముగలఆవుల పాలు త్రాగినవారుకూడా ఈ వ్యాధికి లోనగుదురు.

పాలకు నిరోధశక్తి తక్కువ, గావున దీనిలో సూక్ష్మ క్రిములతిసులభముగా వర్ధిల్లును. ఆవు పాలవల్ల సామాన్యముగా కంఠరోహిణి (Diphtheria), సన్నిపాతజ్వరము మొదలగునవి వ్యాపింప చేయబడును. పాలనుంచుపాత్రలు క్రిమిదోషము కలిగియున్నను, పాలను పితుకువారో, అమ్మువారో రోగిష్ఠులై యుండినను, పాలు రోగమలినమగును.

ఆవునుండి అప్పుడే పితికినపాలు వెచ్చగానుండును. ఈ ఉష్ణోగ్రతలో సూక్ష్మజీవు లతిత్వరగా వర్ధిలును గావున పితికిన వెంటనే పాలను చల్లబడునట్లు చేయవలెను. ఇది యితరదేశములలో యంత్రముల సహాయముతో చేయబడుచున్నది. పాలు, శుభ్రముగానుండు పరిసరములలో, ఎంతత్వరలో సేకరించబడి, మనకివ్వబడునో, అది ఎంతతక్కువ వేడిమికలిగియుండునో అంత క్రిమిదోషరహితముగా, శ్రేయస్కరముగానుండును.

పాలలోని మాంసకృత్తులలో నూటికెనుబదిపాళ్లు కేసీ (Casein) నను పదార్థముండును. మిగత ఇరవైపాళ్లు క్షీరకల్కమని పిలువబడు శ్వేతకల్క (Albumen) మను పదార్థముండును. ఈ క్షీర కల్కము (Lactalbumen), కోడిగ్రుడ్డులోని తెల్లసొన ఒక్కటే. ఇదే పాలు కాచినపుడు మీగడగా నేర్పడునది. కేసీను ఒక తెల్లని చూర్ణము. ఇది ఫార్మాల్డిహైడు (Formaldehyde) అను ద్రవముతో సంయోగమునొంది కృత్రిమ దంతము (Artificial Ivory) ని పిలువబడు ప్రసిద్ధిచెందిన పట్టీ (Plastic) గా నేర్పడుచున్నది.

## పాలు పులియుట

పాలు ఒకచోటనే చాల కాలముంచినయెడల పులియును. ఇది కొన్ని ఆమ్లజనక సూక్ష్మ జీవులు(Acid Forming Bacteria) పాలచక్కెర పై యొనర్చు కార్యము. పాలచక్కెర ద్రాక్షశర్కర (Glucose) గాను, క్షీరామ్లముగాను మార్చబడును. క్షీరామ్లము కేసీనును గడ్డకట్టుకొనచేయును. దీనికే పాలు విరుగుట యనిపేరు. ఈ సూక్ష్మక్రిమికార్యము వెచ్చనిపాలలో త్వరగా జరుగును. కావున వేసవిలో పాలు కాచినవెనుక చల్లనిచోట భద్రపరుపక పోయినచో పాలు విరిగిపోవును.

ఈ గడ్డకట్టునొన్న కేసీనునందే పాలలోని క్రొవ్వంతయు యుండును. ఇదే పెరుగు లేక దధి. పెరుగు బాగా ఏర్పడుటకు పాలకు మజ్జిగ కలిపెదరు. పాలు గడ్డకట్టుకొన్నప్పుడు లేక విరిగినపుడు మిగిలిన నీటివంటిద్రవము వే (Whey) అని పిలువబడును. ఈ వే లోనే పాలలోని చక్కెర ఉండును. ఇది రోగిష్ఠులకు ఆహారముగా వాడబడును. వైద్యులు పాలను నిమ్మపులుసుతో విరుగునట్లుచేసి, దానినుండి వే తీసి రోగులకిచ్చెదరు.

(సశేషము)

# సామెతలు

126. ఆవు చేనిలో మేసిన దూడగట్టున మేయునా ?
127. అంత్యనిష్ఠురముకన్న ఆదినిష్ఠురముమేలు.
128. అద్దెకు తెచ్చినగుఱ్ఱము అగడ్తలుదాటునా ?
129. అన్నరసముకన్నను ఆదరణరసముమేలు.
130. అరటాకువచ్చి ముల్లుమీదపడినను అరటాకునకేమోసము;
ముల్లువచ్చి అరటాకుమీదపడినను అరటాకునకేమోసము.
131. అవివేకితో స్నేహముకన్న వివేకితో విరోధము మేలు.
132. ఆకలి ఆకసమంత; గొంతుక సూదిబెజ్జమంత.
133. ఇచ్చేవారికి పత్రిము చచ్చేవారికి మందు అనవసరము.
134. ఇంటిపేరు కస్తూరివారు ఇల్లు గబ్బిలాలకంపు.
135. ఇల్లాలు గ్రుడ్డిదైన ఇంటి కుండలకు చేటు.
136. ఉంగరాల చేతితో మొట్టిన నొప్పియుండదు.
137. ఆవులింతకు అన్నదమ్ములున్నారుకాని తుమ్ముకు తమ్ముడులేడు.
138. "ఇరుసున కందెన బెట్టక పరమేశుని బండియైన పారదు సుమతీ."
139. ఇల్లుమింగే యత్తగారికి యుగముమ్రింగే కోడలు.
140. ఉత్తచెవికన్న తాటాకు చెవిమేలు.
141. ఉడుతకేలరా ఊరిలో పెత్తనము.
142. ఎంచబోయిన మంచమంతను కంతలే.
143. నెమలి కంటినీరు వేటగానికి ముద్దా ?
144. కాలితో చూపితే తలతో చేయవలయును.
145. కుడువబోతూ కూరాకురుచి అడిగినవిధము.
146. కానున్నది కాక మానదు.
147. కాగలకార్యమును గంధర్వులే తీర్చిరి.
148. కాకిని పంజరములో నుంచినమాత్రాన చిలుకవలె పలుకనేర్చునా?
149. కలిగినవారింట కడగొట్టు కోడలయ్యేదికన్న పేదవారింట పెద్ద కోడలవుట మేలు.
150. కుక్కనుచంపి గుడి కట్టినా పాపము తీరదు.

# గురువును మించిన శిష్య

శ్రీమతి యు. సత్యబాల సుశీలాదేవిగారు

మార్గాయాసంతో, గంగాదాసు ఆ శిథిలదేవాలయపు మెట్లపై చతికిలబడినాడు. క్షుద్బాధతోను, గమనాయాసంతోను అతడి ప్రాణపక్షి ఎగిరిపోదామనే ప్రయత్నిస్తున్నది. అంతలో, ఆ నిర్జనవనపు రమణీయ ప్రకృతీ—సమీపంలోనున్న శిథిలసరోవర నిర్మలజలమూ అతణ్ణి సేదదీర్చేయి. చేతికందినన్ని జామపండ్లు తిని క్షుధానివారణ చేసికొని, పరిసరాలన్ని పరిశీలించేడు. శిథిలదేవాలయంలో ఉజ్జ్వల నారాయణమూర్తిని చూచి అతని భక్తహృదయం ద్రవించిపోయింది; హృదయజ్యోతిని దీపహారతియొనర్చి భక్తిఫలము నివేదించినాడు. మరునాటినుండి అదే అతనివి వాసస్థానమైనది. అనతికాలంలోనే నారాయణుడు శుభ్రాలయవాసియై నిత్యపూజలందుకోసాగాడు.

కాలవాహిని పరువులెత్తినది, ఎండిపోయిన ఆశాలత చిగురించి పూవినది. గంగాదాసుని భక్తి ప్రేమలు, నారాయణుని మహిమ, దశదిశల వ్యాపించినవి. పరిసర ప్రజల రాకపోకలు పూజాభజనలు-పూజారుల మంత్రఘోషలు వనమంతా ప్రతిధ్వని నించినవి. ఆ లయపునర్నిర్మాణముతోబాటు మఠనిర్మాణముకూడ పూర్తియైనది. గంగాదాసు మహంతయినాడు, యికమిగిలినది—మంత్రము - జ్యోతిషము-తాయిత్తులు-రోగనివారణలు; అన్నియు పూర్తియైనవి. శిష్యబృందంకూడా తక్కువకాలేదు—అందుదృఢ భక్తియుతులు లేకపోలేదు.

మూర్తిభవించిన గురుభక్తియే దేవకి-అనాథ-ఉన్న ఒక్కగోవునే నమ్ముకొని క్షీరవిక్రయమొనర్చి జీవించునది. గురువునే దైవమనీ గురువాక్యములే మంత్రములనీ నమ్మినది. అప్పుడప్పుడు కొలది క్షీరములు గురువునకు కానుకయిచ్చెడిది. గురుపౌర్ణమివచ్చినది; మఠములో కోలాహలమునకు మితిలేదు — గురుపూజకు వివిధములైన ఏర్పాట్లు జరుగుచున్నవి. అపారమైన జనసంతర్పణ. దానికి తగిన పాలు, పెరుగు, నెయ్యి, కూరలు కావలసియున్నవి. అందరూ శక్తివంచన లేకుండావస్తు సేకరణచేస్తున్నారు. క్షీరవిక్రయమొనర్చునదిగావున కావలసిన క్షీరమంతయు దేవకి తేగలదని గురువు తలంచినాడు. కాని, నిజస్థితిని ఆయన మహంతుపదవి లెక్కగొననీయలేదు. దేవకి ఆలోచించినది. ఆమె స్థూలదృష్టిలో గోవు — అంతర్దృష్టిలో భక్తిదక్క వేరేమియు గోచరింపలేదు. గురువునకేమి సమర్పించగలదు? హృదయధనమంతయు భక్తిధనముగా నొనర్చి యేనాడో గురువునకు సమర్పించినది. నేడిచ్చునది కేవలంలాంఛనమాత్రమే. కాని ఏమి కలదు; గోమాతగర్భిణి-అది యిచ్చు స్వల్పక్షీరములు అనుదినము కొనువారికే చాలుటలేదు. అయినను వారినే బ్రతిమాలుకొని నాడాకొలది క్షీరములు వారికివ్వక-ఒకశుభ్రకలశంలో భద్రపరచుకొని గురుసన్నిధికి వచ్చినది. తండోపతండములుగ నరుదెంచు జనప్రవాహమును, విరామమెరుంగక, విలువగల కానుకలెన్నియో సమర్పించు శిష్యగణము కన్నులారగాంచి హర్షపులకితయైనది. అందరివెనుక అపరాధినివలె లజ్జావినమ్రతాంగియై-ఆ చిన్నిక్షీర కలశమును గురుపాదములకడనిడి ప్రణమిల్లినది. గురుదేవుని కన్నులు క్రోధారుణిత మొందినవి. నాటి గంగాదాసునందలి భక్తి ప్రేమలు నేటిమహంతుపదవి మహాత్మ్యమున కరుడుగట్టిపోయినవి-వజ్రసన్నిభముకూడనైనవి.

“దేవకీ! ఎంతసిగ్గులేకపోయినది. ఇంత నీచపు కానుక తేగల్గుటకన్న నదిలో ప్రాణమర్పించిన మేలుగా నుండెడిదిగదా! క్షీరవిక్రయమొనర్చి జీవించుదానవు· సంతర్పణకైనను క్షీరమీజాలవా, యింత కాఠిన్యమా!” అని తృణీకరించి కసరినాడు.

దేవకి నీరవరై నిలచి గురుముఖము చూచినది, నీరు క్రమ్ముకొనిన కనులను, కొంగున తడియార్చి, మరల పాదములకు మనమున నే నమస్కరించినది. గురుపూజకింత హీనమైన కానుక యర్పించుటకన్న నదిలో ప్రాణము లర్పించుట శ్రేయస్కరమను గురువాక్యము స్మరించి శిరసావహించినది.

సుధాధవళమై విరిసిపోవుచున్న వెన్నెల వెలుగులో, యింద్రనీలమై పొంగి పొరలుచున్న యమునా తరంగిణి తళతళ లాడుచున్నది. అంతియు ప్రశాంతసమయము, నిశ్చల చిత్తముతో గుర్వాజ్ఞ నిర్వర్తింపను దేవకి ధైర్యయుత నిశ్చల మనంతో నదీతీరానికి వచ్చింది. ఆ ప్రశాంత నిర్మల ప్రకృతిలో ఆ భక్త హృదయం పొంగి పరుగులువారింది.

"ప్రభూ! దయామయా, ఈ నీ నిర్మలమైన విశాలసుందర సృష్టిలో దుఃఖము, ఆవేదన చిరకాలము నిలుపరించదు. గురుమూర్తి, బాహ్యమున నీ కనులపడు పేదరికముగాక, అనంతైశ్వర యుక్తమగు భక్తి హృదయము గ్రహించునట్లొనర్పుము స్వామీ!" యని నమస్కరించుచు నదీగర్భమున మునుకవైచినది.

శంకాన్వితముకాని దృఢవిశ్వాసమే మానవుని వున్నతికి సోపానపంక్తి అతీతమైన సుందర దృఢ బాహువులు రెండు దేవకిని లేవనెత్తి ఒడ్డుకు చేర్చినవి. దేవకి కనులు విప్పిచూచినది. నీలనీరదశ్యామలమైన నారాయణుని కోమలవిగ్రహము! — "దేవకీ! భయపడవలదు నీ కనంతైశ్వర్యము కావలయునేని చెప్పుము,"

భయసంభ్రమములు, భక్త్యాశ్చర్యములు, దేవకిని ముంచెత్తినవి. గాద్గదికను సవరించుకొని ఎట్లో చెప్పగలిగినది.

"ప్రభూ! నీ యవ్యాజకరుణ, నీ యందలి నిరంతర భక్తికన్న నాకేమీ వలదు." ఆహా! నిజభక్తుల నిశ్చల హృదయము ధన్యము!

"దేవకీ నీవు వలసినప్పుడెల్ల ఆప్తునివలె పిలచి నా సాయ మపేక్షింపవచ్చును. ఇదుగో! ఈ పాత్రతో నీ గురుని తృప్తినొందింపుము"—వినీల తేజో సౌందర్యరాశి అదృశ్యమై పోయినది.

దేవకి కన్నులమత్తు విడిపోయి, జరిగినదంతయు కలలోవలె స్ఫురణకువచ్చినది. గురుదేవుని దయవలన భగవద్దర్శనమైన దనుకొన్నది! - స్ఫటికవినిర్మలహృదయమది! - మలినమునకు తావులేదు! గురుప్రాంగణమునకు పరుగునపోయినది. "దేవా! ఇవిగో క్షీరములు" — గురువుచూచినాడు — తన తిరస్కృతిపని చేసినది, ఎచ్చటనో క్షీరములసాధించి తెచ్చినదని తలంచి గర్వించి, తలయూచినాడు. కాని ఏ మాశ్చర్యము! మఠమునందలి, రిక్తపాత్రలన్నియు క్షీరభరితములై పోవుచున్నవి. దేవకి చేతిలోని చిన్నపాత్ర నుండి క్షీరధార నిలుచుటయేలేదు! దివ్యవాహినివలె అవిరళమున ప్రవహించుచున్నది. దేవకి జరిగినదంతయు గురువునకు నివేదించినది. గంగాదాసుని దృష్టి వినిర్మలమైనది. కన్నుల ఎదుటి గర్వాంధకారము విరిసిపోయినది. జ్ఞానజ్యోతి తలయెత్తి గతమంతయు యింద్రజాలమువలె ఎదుట స్ఫురింపసాగినది.

"అమ్మా! దేవకీ! నీవే గురుదేవతవు. నన్ను రక్షించి నాకుకూడ నారాయణుని చూపించుమని" సాష్టాంగపడిపోయినాడు. మాయావరణ విడిపోయిన మనుజాలయందు మిగులున దంతయు నవనీతము! తన్నవనీతమే శ్యామసుందరుని వాంఛిత వస్తువు.

దేవకి శిరసావహించినది. మరల నదీతీరమునకువచ్చి, దీనాతిదీనరై, గురునికొరకు నారాయణుని ప్రార్థించినది. ఎట్లో సాధించి గురునకు ప్రభుదర్శనము చేయించి తరింపజేసినది. ఇప్పుడింక మహంతుగాని తత్సంబంధమైన అహంకృతికాని మిగిలియుండలేదు. యమున-దేవకి-మఠము-దేవాలయము సర్వత్ర నిండిపోయినవి. సర్వత్రనిండిపోయినది శుభ్రవినీల కాంతి మయమైన నారాయణ స్వరూపమే! ఆ దివ్యానందము లోపించునను భయమున దాసు మరి మఠావరణ త్రొక్కిచూడలేదు - ఆ పవిత్ర యమునా తీరముననే ఒక క్షుద్ర కుటీరమున జీవితశేష మానందమయముగ గడపి నారాయణునియందు లీనమై పోయినాడు.

# స్త్రీ : పురుషుడు

శ్రీమతి యడవల్లి శ్యామలాదేవిగారు

ఆదిలో ప్రపంచంలో ఇళ్ళూ, మేడలూ, మిద్దెలూ లేవు. అంతా అరణ్యమయం చెట్లు చేమలతో నిండి నింపారుతుండేది. స్త్రీలు, పురుషులు స్వేచ్ఛగా తిరుగుతుండేవాళ్లు. ఒకరిపైనను మరొకరికి ఏ విధమైన అధికారములేదు. ఎవరికి వారు ఆహారాన్ని సంపాదించుకొని తినేవాళ్లు. ఎవరికివారు వారిరక్షణను చూచుకొనేవారు. ఎవరికివారు వారి జాగ్రత్తలో ఉండేవారు.

ఇలా ఉంటుండగా, ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క పురుషునితో సంసార సుఖాన్ని పొందటం సంభవించింది. తత్ఫలితంగా స్త్రీ గర్భాన్ని ధరించింది. అప్పటిదాకా స్త్రీ, పురుషులు ఎవరికివారు ఆహారాన్ని సంపాదించుకునేవాళ్ళు. ఇంతలో స్త్రీకి ప్రసవకాలం సమీపించింది అందుచేత కష్టంచేయలేక పోయింది. తన ఆహారాన్ని తాను సంపాదించుకోలేకపోయింది. ఇక గత్యంతరంలేక పురుషునిమీద ఆధారపడవలసి వచ్చింది.

"నేను నా ఆహారాన్ని సంపాదించుకో లేకుండా ఉన్నాను. నీవు ఆహారాన్ని నాకు తెచ్చిపెట్టు" అని పురుషుణ్ణి కోరింది. పురుషుడు 'సరే' నని తన ఆహారంతో పాటు తన స్త్రీకిగూడా ఆహారాన్ని సంపాదించుకొని వచ్చిపెట్టటం సాగించాడు.

అప్పటిదాకా స్త్రీలు, పురుషులు చెట్లపైన నివసిస్తుండేవాళ్ళు. క్రిందనివసించటానికి భయం వాళ్ళకు. ఎందుచేతనంటే అవన్నీ అరణ్యమయి ప్రదేశాలు. రాత్రిపూట అడవి మృగాలు సంచరిస్తుంటాయి. ఈ స్త్రీ గర్భంధరిచటం మూలాన రోజూ చెట్టెక్క లేకపోయింది. అందుచేత నేను క్రిందనే నివసించటానికని ఉపాయం చూడమని పురుషుని వేడుకుంది. వెంటనే పురుషుడు తన స్త్రీకోసమని చెట్టుక్రిందనే క్రూరమృగాలు రాకుండా ఒకచిన్న ఆవరణను ఏర్పాటుచేశాడు. ఆ ఆవరణలో స్త్రీ ఉండేది. పురుషుడు బైట తిరిగిఆహారాన్ని సేకరించుకొనివచ్చేవాడు. ఆ ఆహారాన్ని స్త్రీ పచనముచేసేది. స్త్రీపురుషులిరువురూ వాన్ని భుజించేవారు. ఈపద్ధతే క్రమక్రమంగా వృద్ధియై నాగరికత విస్తరించిన కొలదీ పరిపక్వంచెందింది. నేటి మన సంఘువ్యవస్థ ఇట్లేర్పడినదే!

దీనినిబట్టి చూడగా స్త్రీకి వస్తుతః పురుషునితోపాటు సరిసమానమైన హక్కు, స్వాతంత్ర్యం ఉన్నట్లుగా తేలుతున్నది. ఏవిషయంలోనూ స్త్రీ పురుషునికి బానిసగాని, జీతకత్తెగాని, హీనమైనదిగాని కాదని స్పష్టంగా ఋజువౌతోంది.

స్త్రీలు, పురుషులు కలసి మెలసి చెరొకపనిని అందుకుంటేనే వారి గృహచక్రం సక్రమంగా నడుస్తుంది! వారిబండి సజావుగా సాగిపోతుంది. లేకుంటేవారిచక్రభ్రమణం ఆగిపోతుంది. వారిబండి చలనం తగ్గిపోతుంది.

# రీటా తలవెండ్రుకలను పెంచును



రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటివెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట. చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటావాడుడు.

రీటా ప్రతిచోటా దొరకును. వెల సీసా 15 అణాలు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపావర్ :** ఉత్తమమైన హెయిర్‌టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్‌కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తలవెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్టమైన హెయిర్‌టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనమును చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు అహ్లాదాన్ని కలిగిస్తుంది. తలవెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మిబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజూవైనది.

**రాజమ్మ :** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘవినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# శిశువాఙ్మయకలాపం

డాక్టర్ పోలాకి శ్రీనివాసరావుగారు.

## ఇ ి

## చిలిపి బావ



చిలిపిబావ! చిలిపిబావ! కినిసినావా?
మసిరాసి పాపాయికి విసిగించావా?
అందమా! చందమా!
అ-హ-హాహ-హా!
పంతమా?
వింతగా
పిలక తిరిగి
కిల కిల కిల
మిడిసి పడి
నడచినావా! బావా
ఇ-హి-హి_హి-హి.

## ఊ ీ

## ఊటీ

పదరా పదరా
పదరా ఊటీ
ఎండా కాలం
తండా నీటిని
హాయిగ గాలిని
ఆర గింతాం
రాజా రీతిని
తాజా ఇడిలీ
చీనీ చిలక
సోడీ మిఠాయీ
తీపి జిలాబీ
తిందాం తిందాం!



# లోకవార్తలు

గతమాసంలో అమెరికాలో శాంటియాగో అనేపట్టణమందు 10 సం॥ల బాలిక కడుపులో భరింప రానిపోట్లు అంటూ వైద్యశాలకు పోయినది. డాక్టరు పొట్ట ఒత్తిచూచి ఆమె త్వరలో ప్రసవించపోతున్న దని కనిపెట్టాడు. ఈ ఆశ్చర్యం సోదరడాక్టర్లు నలుగురితోను పంచుకుందామని వారిని వీరిని పిలువపోయి నాడు. నలుగురిని వెంటపెట్టుకొని వచ్చేసరికి ఆ అమ్మాయి గుమ్మడిపండువంటి కొడుకునుగని కులాసాగా కూర్చొని యున్నది. ఇందుకందరు ఆశ్చర్యపడుతుంటే వారిలో ఒకరు యిదేమంత ఆశ్చర్యం 1939 లో 5 సం॥ల బిడ్డ శిశువును కనలేదా అని జ్ఞాపకం చేశారు.

♦ ♦ ♦ ♦

కాలిఫోర్నియాలో జాకులీకోచెరన్ కన్య విమానాన్ని గంటకు 446 మైళ్ల వేగంలో 1250 మైళ్లు ఏకఘాటిన నడిపి ప్రయాణంచేసింది. ప్రపంచంలో యింతవేగంగా యిదివరకెవరు విమానం నడుపలేదు. 19-5-1946 న లెఫ్టినెంట్ జె. జె హంకాక్ అనే అమెరికావాసి మాత్రం గంటకు 440 మైళ్ల వేగంతో విమానం నడపియున్నాడు.

♦ ♦ ♦ ♦

రేడియో మంచి ప్రచార సాధనము. ఎంత దూరంనుంచీ మాట్లాడిందైన వినబడుతుంది కదా! అందుచేత రాజకీయవేత్తలు తమతమ పార్టీ ప్రచారమునకు దీనిని బాగా ఉపయోగిస్తున్నారు. గతమాసంలో జకోస్లావేకియాలో ఎలెక్షన్లు జరిగినవి. ఆ ఎలక్షను నాటికి రెండురోజులు ముందుగా ప్రధానమంత్రి తన పార్టీ కార్యక్రమాన్నిగూర్చి రేడియో ప్రసంగం చేశాడు. వుపన్యాసాన్ని ప్రతి పౌరుడు తప్పకుండా విని తీరాలని యుత్తరువుచేసి అలాటి ఏర్పాటుచేశాడు. అతడు కమ్యూనిస్టు పార్టీకి చెందినవాడు.

♦ ♦ ♦ ♦

ఈ మాసంలో బ్రిటిషు దీవులలో ఒలింపిక్ పందెములు జరుగుచున్నవి. వాటిల్లో ఒకటి స్త్రీల జల క్రీడ. ఈ జలక్రీడలకుగాను క్రొత్తసరస్సు ఒకటి కట్టారు. దాని నిండా నీళ్లుపెట్టినారు. కొన్ని ఓషధుల తోను, రసధాతువులతోను, ఆ నీటిని పరిశుభ్రమొనర్చారు. అవి ఎంత పరిశుభ్రమైనవంటే అందులోఉన్న 10 అ॥ల లోతు నీళ్లలో ఒక గుండు సూదిని వదలినా అది బాగా కనిపిస్తుందట. అందుచేత నీటిలో మునిగి క్రీడలాడే యువతులు ఏదైన తప్పాడితే పైనుండి సులభంగా తెలిసికోవచ్చుట. ఏ ధాతువులు, ఓషధులు కల్పకుండానే మన మహానందిదేవాలయములో ఉండే చెరువు నీరు పైవిధంగానే స్వచ్ఛంగా ఉంటాయి,

ఆ నీటి బుగ్గ మహానందీశ్వర లింగం క్రింద పుట్టి, మట్టి కలియను వీలులేకుండా రాతి తొట్టిలోనుండి సరాసరి వచ్చి ఆ చెరువులో పడుతుంది. చెరువులో ఎన్ని గజములలోతునుంచో గులకరాళ్ళుకలిసిన యిసుక ఉన్నది. అందులోనూ నల్లపూసవిడిచినా స్పష్టంగా కనపడుతుంది.

♦ ♦ ♦ ♦

దక్షిణదేశంలో దేవతా విగ్రహంతోపాటు అర్చకులుకూడా ఎక్కి కూర్చుంటే వాహకులు మోయడం అలవాటు. గతమాసంలో చెన్నపట్నమున ఏడుబావులవద్ద ఉండే అరుణాచలేశ్వర దేవాలయపు ఉత్సవములకు అర్చకులతోపాటు దేవతావిగ్రహాన్ని మోసేదిలేదు అని వాహకులు మొండికి వేశారు. తీరా దేవతా విగ్రహములను అమర్చిన తర్వాత ఉత్సవము ప్రారంభమయ్యేటప్పుడు యిల్లా అనడంచేత అందరు ఆశ్చర్యమొంది బ్రతిమాలినారు. ఉత్సవం సాగించను పోలీసు సబ్ యిన్స్పెక్టర్ వారి సహాయమున క్రొత్త వాహకులను తెచ్చిరి. పాతవాండ్రు వారిని బెదిరింపబోగా కొందరిని అరెస్టుచేసి ఉత్సవం సాగించిరి.

♦ ♦ ♦ ♦

మద్రాసు కంటి ఆసుపత్రిలో కంటిలో శుక్లంపెరిగి చూపుపోయిన కంటిగుడ్డును, తీసివేసి చనిపోయిన వాని కనిగుడ్డు అమర్చి చూపు తెప్పిస్తున్నారు.

♦ ♦ ♦ ♦

చెన్నపట్నంలో దొంగలజట్లు ఏర్పడి నాలుగుమూలల దొంగతనాలు చేస్తునారు. వీరు బంగారపు సొమ్ములు, నగలు, నోట్లు, మొదలైన విలువగల తేలికసామానులను పట్టుకపోతున్నారేగాని గుడ్డలు, పాత్రిసామానులు, బరువుగలసరకు పట్టుకపోవడంలేదు. వీళ్ళు ముఖ్యంగా కిటికీల యినుపచువ్వలువంచి, విఱచి, యిండ్లలో ప్రవేసిస్తున్నారు. యిటీవల వుపయోగపడుచున్న కిటికీకమ్ములు పూర్వమునాటి యంత ధృఢంకాకపోవడం, వాటిని చట్టంలోకి పూర్తిగాదించి తాపటంచేయకపోవడం, అనేవే ముఖ్యకారణాలు. పోలీసులున్ను వీరిని పట్టుకోడానికి బందోబస్తుగా గస్తీ తిరుగుతున్నారు. గతనెల 20 వ తేది రాత్రి ఒక చిన్నతమాషా జరిగింది. మైలాపూరులో 20 సం॥ ల యువకుడు రాత్రిపూట ఉన్నట్లుండి ఒకవీధిలో దొంగదొంగఅని కేకవేశాడు. మఫ్టీలో గస్తీ దిరుగుచున్న రామనాథయ్యర్‌గారు అనే పోలీసు యిన్స్పెక్టరు ఆ అరచినవాడే దొంగఅనుకొని వానివెంటబడ్డాడు. వాడును చిక్కకుండా పరుగెత్తినాడు. యింతలో దైవవశాత్తు యిన్స్పెక్టరుగారు గోతిలోపడ్డారు. ఆ పాటువల్ల చిన్నగాయాలుతగిలి ఆయన, తడివి చూచుకుంటుంటే ఆ యువకుడు నిలబడి "నేను దొంగనుకాదు. మీరెంత బందోబస్తుగా గస్తీ తిరుగుతున్నారో పట్టిచూతామని యిలా అరిచాను. ఆ-ఆ-! బాగానే గస్తీతిరుగుతున్నారులే" అని తనదారిన తానుపోయాడు.

—★—

# జీవచ్ఛవము

శ్రీమతి వేదగిరి విమలాదేవిగారు

ఎవఁడుభారత భూదేవినెడఁద నిడఁడో!
నాదుదేశంబ! నాతల్లి! నాప్రియంబ!
యనుచు సద్భక్తినేనీచుఁ డనడో యతఁడు
బ్రతికియుండియుఁ జచ్చినవాఁడుకాఁడె?




ఇండియాలో నార్వేదేశపు రాయబారి భార్య మదాం హెలెన్ బార్గ స్వీడన్ దేశంలో జరుగుచున్న సాంఘిక సేవనుగూర్చి బొంబాయిలో యిట్లుపన్యసించినది:—

సాంఘికసేవ అనగా కలవారు లేనివారికి వెళ్ళి సహాయం చేయడం అనేపద్ధతి స్వీడన్‌లో లేదు. అక్కడ ప్రతివారి కష్ట సుఖములు ఆదరింపబడు విధముగా సంఘము ఏర్పాటైయున్నది. దయామయులైన ధర్మనారీమణులు భిక్షాపాత్రములతో పేదవారినాదరింప వారి యిండ్లకు వెళ్ళరు. ఏమంటే అక్కడ పేద వారేలేరు. పేదవాళ్ళ మురికి కూపములలో పాతకాలలు పెట్టే వారులేరు. ఏమంటే అక్కడ మురికి కూపాలేలేవు. స్వీడన్ దేశీయులు చాలా స్వతంత్రభావం కలవారు. ఆత్మగౌరవం గలవారు. యితరుల దగ్గర ముష్టితీసికోడం వారికసహ్యం; కాబట్టి యితరులవద్ద బిచ్చమెత్తితెచ్చి దుర్భరపరిస్థితులు చక్కపఱచుట కన్నా అసలాపరిస్థితులకు మూలమునే ఛేదించుటకు ప్రయత్నించెదరు. అందుకుగాను జీవితమును దుర్భర సాంఘిక పరిస్థితులు ఏర్పడకుండునట్టి విధమున సర్దుబాటుచేశారు. బీదలు ఆకలిబాధితులు, ఒళ్ళు గుడ్డలు మాసినవారు, చదువులేనివారు లేకుండాచేయడమే అక్కడ ఆదర్శము. అనారోగ్యం, పనిలేనితనం, ముసలి తనంలో సహాయములేకపోవుట అనేవాని భయంకూడా తొలగించవలెననే వారి ఆదర్శము. మా దేశంలో "బీదఅనే మాట మేమెన్నడు వినము" "కొద్ది ఆదాయము గలవారు" అని కొందరు గలరు. వారికి వెన్న మొదలైన ముఖ్యమైన ఆహారపదార్థములను కొనుటకు ప్రత్యేకముగా చీట్లిస్తారు. వారు ఆ చీట్లతో తక్కువ ధరలకు వాటిని కొనుక్కుంటారు. ఆ ధరల తేడా వాని ఉత్పత్తిదారులకు ప్రభుత్వం అచ్చుకొని చెల్లిస్తుంది. స్వీడన్‌లో విద్యావిధానము ఉచితము, నిర్బంధముకూడా. ప్రతివారికి వైద్యం ఉచితం. ఎండాకాలంలో బసచేయడానికి ఉచితమైన శిబిరాలున్నాయి. చిన్నబిడ్డలువెళ్ళి నివసించను ఉచితవసతులున్నవి.

స్వీడన్ ప్రభుత్వము యిండ్లవసతికి ఒక గొప్ప ప్లాను నడుపుతున్నారు. బిడ్డలు హెచ్చుగావుంటే గవర్నమెంటు యిండ్ల అలవెన్సులు యిస్తారు. నలుగురు బిడ్డలకన్నా హెచ్చుగాయున్న ఆ కుటుంబానికి యింటి అద్దెలో 100 కి 40 వంతులు ప్రభుత్వం అచ్చుకుంటుంది. సొంతంగా యిల్లు కట్టుకోవలెనంటే అయ్యే ఖర్చులో 100 కి 90 వంతులు గవర్నమెంటువద్ద అప్పుచేయవచ్చును. వడ్డీ చాలతక్కువ తీర్చవల సిన కాలపరిమితి చాలహెచ్చు. అందుచేత పెట్టుబడి లేకుండానే కార్మికుడు తన సొంతయిల్లు అని ఏర్పఱచుకో వచ్చును.

పన్నులు తరతములుగా అమర్చబడ్డవి. అందుచేత దేశంలో విశేషధనవంతులుండరు. కలవారి దగ్గర తీసికొని లేనివారికిచ్చి ప్రభుత్వం ప్రజలనందరిని సమానులను కావించినది. అక్కడ ఆ గర్భ శ్రీమంతులు అని కొందరులేరు. అందఱు కష్టించి పనిచేసి సామాన్యపు బ్రతుకు బ్రతకవలెను. నిజమే.

ప్రభుత్వ మేర్పఱచిన ఈ పద్ధతంతా ఖర్చుతో కూడుకొన్నది. ఈ ఖర్చు వారు సైన్యానికి పెట్టే ఖర్చుకు మూడు రెట్లగుచున్నది. వీనికి విద్యఖర్చుకూడా చేరిస్తే ప్రభుత్వ మొత్తం ఖర్చులో సంఘసేవకై చేసే ఖర్చు సగమగుచున్నది.

♦ ♦ ♦

బ్రిటిషు హైకమిషనర్ భార్య జి. వి. కిట్సన్ సతి బ్రిటన్‌లో సాంఘిక సేవను గూర్చి ఆ సభలో యిట్లు చెప్పినది:-

ఈమధ్య నేషనల్ యిన్సూరెన్సుచట్టము అని ఒకటి చేయబడినది. దీనినే ఉయ్యాలలోనుండి స్మశానము చేరేదాకా సంరక్షించే చట్టముఅన్నారు. ఈ చట్టము చాలా ముఖ్యమైనది. దీనివల్ల లోటు అనేది యుండదు. ముసలితనం, వ్యాధి, పనిలేమి, కలిగినపుడు పెన్షనులిస్తారు. గర్భిణీ స్త్రీలకు ప్రత్యేక భత్యములిస్తారు. రెండవ ప్రపంచయుద్ధమయినతర్వాత యిది, యింకా యిలాంటి చట్టాలు కొన్ని చేయబడ్డవి. దీని అభిప్రాయమేమంటే బ్రిటిషుదీవులలో ఏ సందర్భములో జన్మించినా ప్రతి శిశువు లేక పౌరుడు ఏలోటులేకుండా ఏలాంటి ఆదుర్దాపడకుండా క్షేమం లేదనుకోకుండా ఆరోగ్యం, విద్య, పనికలిగి సుఖించడానికి సరిసమానమైన అవకాశములు కల్గించుట.

  

అడయారు బిసెంటు హైస్కూలునందు జరిగిన మద్రాసు ఉపాధ్యాయుల సంఘ యాజమాన్యమున జరిగిన సాంవత్సరిక విద్యామహాసభలో "స్కూళ్లలో" సైనిక శిక్షణ అనే విషయమునుగూర్చి ఉపన్యాసములు జరిగినవి. శ్రీమతి క్లబ్‌వాలా గారు బాలికలకుకూడా సైనికశిక్షణ యివ్వవలెనన్నారు. వై. యం. సి. ఎ. తాలూకు శ్రీమతి బాల్‌గారు కూడదని యిట్లుపన్యసించారు:-

స్త్రీలు యుద్ధసమయమందు వేరువిధముగా సహాయపడవచ్చును; కాని బాలికలు ఆయుధముల నుపయోగించుట ఇండియాయొక్క నాగరికతకు వ్యతిరేకము.

  

త్యాగరాయనగరంలో శ్రీ శారదా విద్యాలయం (శిశుశాలయం ప్రాథమిక పాఠశాల) లో శ్రీ సర్. టి. యస్. వెంకటరామన్‌గారు స్త్రీ విద్యనుగూర్చి యిట్లుపన్యసించిరి:-

"20 సంవత్సరముల పూర్వము స్త్రీలకు విద్యఅవసరమాయని తీవ్రముగ చర్చించుచుండిరి. ఇప్పుడు మనదేశము బాగుపడుటకు స్త్రీలకు విద్యఅవసరం అని గుర్తింపబడినది. ప్రస్తుతము మనభారతీయ స్త్రీలు మనదేశమున గొప్పపదవుల నలంకరించుచున్నందుకు మనం గర్వించవలసియున్నది. భారతదేశంలో నేటి విద్యావిధానమున చాల లోపములున్నవి. వీనిని బ్రిటిషువారు తమ ప్రభుత్వము సాగించుటకు గుమాస్తాలు కార్యదర్శులు తయారగుటకువీలుగా తయారుచేసిరి. ఇప్పుడు బ్రిటిషుఅధికారములోలగి మనకు స్వాతంత్ర్యము వచ్చినది. కావున ఈ విద్యావిధానమును పూర్తిగా సంస్కరించి పరిపాలన స్త్రీలచేతులలో వదిలి పెట్టవలెను. వారే మనలను అటంబాంబునుండి రక్షించి ప్రపంచమున శాశ్వతముగ శాంతిని నెలకొల్పగలరు.

# సంపాదకీయములు

## ప్రజా సామాన్యమునకు వైద్యము

స్వాతంత్ర్యము సిద్ధించినదని మనము పలికినచో చాలదు. ఆ స్వాతంత్ర్యమును పురస్కరించుకొని ప్రజాసౌఖ్యమునకు మార్గము లరయవలయును. ప్రజాప్రభుత్వమున ప్రభుత్వము-అనగా ప్రజయే-సర్వరక్షకత్వము వహించుచున్నది. అట్టి ప్రజాప్రభుత్వములు ఇతర దేశముల నేమేమి ఎట్లెట్లుగావించుచున్నవో మనము గమనించవలయును. ఇంగ్లీషు ప్రభుత్వమునకు గోసి-మనము స్వాతంత్ర్యము సాధించినామేగాని-వారి దేశమున వారు ఏయే ప్రజాహితకార్యము లెట్లు గావింప గలుగుచున్నారో-మనము పరిశీలించి అవలంబించుట అవమానకరముగాదు. ఇటీవలవారు నేషనల్ హెల్తు సర్వీస్ చట్టమును గావించిరి. ఆ చట్టము ననుసరించి, కలవానికి లేనివానికిగూడ ఉచిత వైద్యసహాయము అందచేయు బాధ్యతను ప్రభుత్వము అవలంబించుచున్నది. అనగా కేవలము ధర్మాసుపత్రులుపెట్టి ధనదాహముగల డాక్టరులకు పేదవారిని ఎరవేయుటకాదు. ఎవ్వరైనను తమ స్వంత డాక్టర్లచే వైద్యము చేయించుకొనవచ్చును. వారి డాక్టరు బిల్లులను ప్రభుత్వమే అచ్చుకొనును. దీనివల్ల, అవసరమైన వైద్యసహాయము పొందజాలని వారెల్లరు అన్నివిధముల వైద్యసహాయమును పొందుచున్నారు. అయితే అది వెంటనే మన దేశమున అవలంబింప వచ్చునని భ్రమయరాదు. ముందుప్రభుత్వ బొక్కసము వృద్ధికావలయును. అందుకు పన్ను లెక్కువగుట చాలదు. ఉత్పత్తి ఎక్కువై ధరలు తగ్గి జాతీయ సంపద వృద్ధిపొందవలెను. ఇందుకు పరిశ్రమలు విస్తరింపవలెను. మరియు ప్రభుత్వమున్నూ వచ్చిన ధనమునంతయు సిబ్బందికే వెచ్చింపరాదు. అట్లని సిబ్బందినిమాన్పు మనము. సిబ్బందిని తగ్గించు ఉపాయము నరయవలయును.

## స్త్రీవిద్య-నూతన దృక్పథము

ప్రస్తుతము విద్యావిధానమున పలుమార్పు లేర్పడుచున్నవి. ముఖ్యముగా నది స్త్రీవిద్య కవసరము. స్త్రీలు పెద్ద యుద్యోగములను సహా పురుషులతో పాటుచేయ నర్హత యుండవలయుననుట నిర్వివాదాంశము. అట్లని అందరు చదివి ఉద్యోగములకెగబాకవలయును అని మేము కోరము. "గృహలక్ష్మి" కచేరీలపట్టి గృహాంగణమును పాడుపెట్టరాదు, "గృహలక్ష్మి" గృహాంగణమందలి మధురవాతావరణము నుండి వేరగుచో గృహము కళావిహీనమగును; "గృహలక్ష్మి"కిని శోభదరుగును. అట్లని ఆధునిక "గృహలక్ష్మి" కేవలము పిల్లలకని, వంటచేసి, ఇల్లలికి, ముగ్గులు పెట్టే ఇల్లాలు మాత్రముగానే యుండవలయునని మేము కోరము. పూర్వకాలపు స్త్రీలు చతుష్షష్టి కళలయం దారితేరినట్లే నేటికవసరమైన గృహపరిశ్రమలన్నియు నామె నేర్వవలయును. దానివలన ఆమెకుటుంబాదాయమును దేశీయ సంపత్తిని వృద్ధిచేయవలయును. నేటిగృహకృత్యములలో-అంట్లుతోముట, గుడ్డలుతుకుట, వంటవండుట సహా - విసుగువేసట కల్గించునవన్నియు నేటికన్న సులువుగను, త్వరగను గావింపగల ఉపాయములు ఆమె నేర్వవలయును. భౌతిక విజ్ఞాన శాస్త్రములందు పట్టములందుచున్న విదుషీమణు లీవిషయమై పరిశోధనలు సలుపవలయును. అట్టి వవలంబించుటచే కల్గు తీరికను, మిగులు శక్తిని గృహపరిశ్రమల కుపయోగింపవలయును. ప్రభుత్వమును ఈగృహపరిశ్రమల కుపకరింప విద్యుచ్ఛక్తి, ప్రతి కుటీరమునకు సరఫరా చేయగలుగవలయును. ఈ విషయమై మద్రాసు ప్రభుత్వ మేర్పరచిన పరిశ్రమల కమిటీ వారు గావించిన సలహాలు గమనార్హములు. అట్లు సరఫరాయైన విద్యుచ్ఛక్తినుపయోగించుకొనే నేర్పున్నూ గృహలక్ష్మి నేర్వవలయును. కావున నేటి విద్యావిధానమందలి మార్పులలో స్త్రీవిద్యా విషయమున ప్రభుత్వ మిట్టివిద్యావిధానమును ప్రవేశపెట్టుదురుగాక.

## జనాభా-ఉత్పత్తి

భారతదేశమున మితిమీరి జనాభా వృద్ధిఅయి పోవుచున్నదనియు, ఉత్పత్తిచేయు పదార్థములు చాలవనియు, కావున జనాభా వృద్ధికాకుండా సంతాననిరోధ మవలంబింపవలయుననియు. అఖిలభారత మహిళా మహా సభాధ్యక్షురాలు శ్రీమతి అనసూయాబాయి కాళే గారన్నప్పుడు మేము ఆ వాదమును ఖండించియున్నాము. అంతకుముందే ఈ విషయమై కూలంకషముగ చర్చించి మన దేశమున జనాభా విస్తారమభివృద్ధి కావడము లేదనియు, ఉన్న చిక్కంతయు, వస్తుజాలముల ఉత్పత్తి మాత్రము తక్కువ యనియు, దేశము సభిక్షమై దేశీయసంపద కావలెనంటే ఏనాటికైనా ఆ ఉత్పత్తి హెచ్చవలయుననియు, ఆ ప్రయత్నమున నిజముగా హెచ్చుప్రజ అవసరమనియు మేము వాదించియున్నాము. నేడు భారతయూనియన్ ప్రధాని శ్రీ జవహరలాలు నెహౄ గారున్నూ ఆసియారాజ్యముల-సభలో ఈ విషయమే నొక్కి చెప్పినందులకు కృతజ్ఞులము. వారి ఈ క్రింది వాక్యములు గమనార్హములు —

"భారత దేశములో మితిమీరిన జనాభావృద్ధి నేను కోరను; కాని మన దేశాన చాలినంత జనంలేరు. ఏమంటే, విశాలమైన భూభాగములు ఇంకా నిర్జనమై యున్నవి.........నీకదే ఇష్టమైతే—మన ఉత్పత్తి శక్తి తక్కువ కాబట్టి, మన జనం హెచ్చు అను అయితే అది వేరు విషయం మనం మన పంటలు, ఇతర వస్తువులు హెచ్చుగా ఉత్పత్తి చేయ నారంభిస్తే, ఆ ఉత్పత్తి పనికి నేటి జనాన్ని అప్పజెప్తే, ప్రతివాడు తనకు కావలసిందేగాక, మరికొంతకూడా ఉత్పత్తిచేస్తే, అప్పుడు మన జనం ఎక్కువ కాదు. కాబట్టి ఉన్న సమస్య, జనాభా తగ్గించడంకాదు; హెచ్చు ఉత్పత్తి చేయడం."

కావున గృహలక్ష్ములు ఆరోగ్యవంతులై, ఉత్తమ ప్రజను కని, పెంచి, వారికి తగు బ్రతుకు తెరువు నేర్పి దేశీయవస్తువుల ఉత్పత్తియు, సంపత్తియు వృద్ధిపఱుప తోడ్పడవలసి యున్నది.

---




కుందమాల.

ఇది సీతావనవాసకథకు సంబంధించిన నాటకము. సంస్కృతమున దిఙ్నాగుడు వ్రాసియుంచినదానిని పండితకవి శ్రీ బులుసు వెంకటేశ్వర్లుగారు తెలుగున కనువదించిరి. ఈ సంస్కృతకవి కాళిదాస సమకాలికుడనియు పిదపవాడైన, భవభూతి తన ఉత్తర రామచరితమున నితని కుందమాలనే అనుసరించెననియు, భవభూతికృతి కావ్యముగా గొప్పదనియు, నాటకముగా కుందమాలయే శ్రేష్ఠమనియు శ్రీ వెంకటేశ్వర్లు గారివాదము. "ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" అని లోకోక్తి. ఇట్టి యుత్తమనాటకమును, ప్రాచీనమును, కీ॥ శే॥ వసురాయకవి ఆంధ్రీకరణముండగా, శ్రీ వెంకటేశ్వర్లుగారు సాహసించి తిరిగి తెనుగుచేయుట ప్రశంసార్హము. అసలే ఈకావ్యగాథ కరుణారసపూరితము. తెనుగుభాష మార్దవమునకు పెట్టినపేరు. అట్టికథను నాటకముగ, కావ్యముగ ఎవరువ్రాసినను-శ్రీకంకంటి పాపరాజు కృతిమాధుర్యమును తేగల్గుట అసాధ్యము. ఆ అవధిలో దీనిని తిలకించుచో - చాల సులభశైలిలో, చాల లలితముగనిది అనువదింపబడినది. లోకాపవాదముచే పరిత్యక్తయైన సీతకథ ఏరూపముననైన స్త్రీలకాప్యాయమని మే మెరుంగుదుము. వెల రు 2-0-0 లు మాత్రమే. వలయువారు పండిత బులుసు వెంకటేశ్వర్లుగారు బి. ఎ. రామారావుపేట. కాకినాడ అని వ్రాయుడు.

ఇంజక్షను చికిత్స.

ఇది తెలుగుగ్రంథము. ఆయుర్వేద వైద్యులకుపయుక్తముగా అలోపతి వైద్యమర్మములను వివరించుచు ఇట్టివియే ఇంకకొన్ని గ్రంథములు రచించియున్న ఆ వైద్యదంపతులు శ్రీ డాక్టరు ముదుంబ దొడ్డయాచార్యులు, లక్ష్మీదేవిగార్లు రచియించినది. గ్రంథముఖమునతాము "అనువాదకులు"గా ఉదహరించిరి. ఏ మూలగ్రంథమునకిది అనువాదమొ ఎచ్చటను తెలుపబడలేదు. ఇది శాస్త్రవిషయము. ఫిజియాలజీమున్నగు కొన్ని ఇతర శాస్త్రములు మూలముగా గలవైద్యశాస్త్రమున నొకభాగము. ఈ గ్రంథము నుపయోగించుకొను ఆయుర్వేద వైద్యులకు, చాలమందికి అయామూలశాస్త్రము లపరిచితములు; ఆయాధాతువులగుణాగుణములను ఎంతమాత్రము వేద్యమో విచారణీయాంశము. సుశిక్షితులైన అలోపతి వైద్యులును ఇంజక్షనులనిచ్చుటలో పప్పులో కాలువేయుటగలదు. కావున ఆయుర్వేదవైద్యులకీ గ్రంథమెంతయుపకరించుననుటమాసంశయము. ఇట్లు సంశయమును వెలిబుచ్చితిమని గ్రంథకర్తలు మాపైకినియకుందురుగాక. అయితే రానురాను దేశభాషలలోనే విద్యాభ్యాసము సాగవలసియున్నది. శాస్త్రవిషయములు దేశభాషలలో బోధింపబడినచో నేటి విద్యావిధానమున జరుగు కాలహరణమంతరించును. అట్టిబోధనకు, విద్యార్థులకు ఇట్టి గ్రంథములవసరము. ఆ అవసరముతీర్ప ముందుగనే వీరిట్టి గ్రంథరచను పూనుటచే దేశీయుల ధన్యవాదముల నందగల్గుదురు. ఈ వైద్యదంపతుల కుటుంబ చారిత్రము నిదివరలో నొకసారి మా పత్రికాముఖమున ప్రకటించియున్నాము. అంతకన్నను సమగ్రముగ, నీదంపతులలో శ్రీ డా లక్ష్మీదేవిగారి చరిత్రము కర్ణికగా, వీరి కుటుంబచరిత్ర ఉపోద్ఘాతమున లిఖింపబడినది. అందు మకుటాయమానముగ - "ఆంధ్రదేశమనందేగాక, ఇండియా అంతటను పొలిటికల్ సఫరింగులో ఈ కుటుంబము రికార్డు బ్రేకుచేసెను" అని వ్రాయబడినది.

ఇట్టి దేశభక్తుల కుటుంబము స్వరాజ్యప్రాప్తి యనంతరము దేశమ్ము కానుకలై తిరుగుటకుగాని, పర్మిట్లకై ప్రాకులాడుటకుగాని అవసరములేకుండ - వైద్యవృత్తి నవలంబించుటయు అత్యుత్తమ గ్రంధరచనకు కూడపూనుకొనుటయు సంతోషదాయకము. శ్రీలక్ష్మీదేవి గారివలనే గృహలక్ష్ములు ధర్మకార్యకలాపములందు విజ్ఞానులై తోడ్పడగల్గుచో మనదేశము అచిరకాలములోనే అత్యున్నత స్థానమలంకరించగల్గును. వెల రు 3-0-0 లు. వలయువారు డా. యం. దొడ్డయాచార్యులు, రేణిగుంట (చిత్తూరు) అనివ్రాయుడు.

## దేశీయవైద్య విజ్ఞాన చరిత్ర - ప్రథమభాగము: వైద్యము—వాఙ్మయము.

వైద్యశాస్త్రము బాహుళ్యమైనది, ప్రత్యేకమైనది. మన ప్రాచీనవిజ్ఞానమందలి ఆద్యములగు వేదములలోని షడంగములయందు ఆయుర్వేదమొకభాగము. పిదప వ్రాయబడిన స్మృతులందును - ఆచార వ్యవహారములలో సూత్రప్రాయమున సంచరించునది వైద్యశాస్త్రమునకు సంబంధించిన ఆరోగ్యవిధుల పట్టే. పిదప వాఙ్మయమునందు సంస్కృతాంధ్ర కావ్యముల కొన్నింటి చేర్చి ఈ గ్రంధముగా "కృషీవలుడు" కూర్చినాడు. నన్నెచోడుని కుమారసంభవము, మహాభారతము, మంత్రి అప్పన చారుచర్య, భీమకవి చాటువులు, మల్లన రుక్మాంగదచరిత్ర, భాగవతము, శ్రీనాధుని కావ్యములు, వేమన, వల్లభరాయుని క్రీడాభిరామము - బైచరాజు వెంకటనాధుని పంచతంత్రము - ఇట్లు ఇంచుమించు ఆంధ్ర వాఙ్మయపు మేటినంతయు - "నీకృషీవలుడు" నూర్చినాడు. కావున కేవలము "హాలికుడు" గాక

కావ్యప్రపంచమున నీ "కృషీవలుడు" అసామాన్యుడని తోచుచున్నది. వైద్యప్రపంచమునను నితడు సామాన్యుడు కాడని మేమెరుంగుదుము, గొప్ప వైద్యశిఖామణి; అయితే ఆయన అజ్ఞాతవాసమును వెలిబెట్టము. ఉభయపరిచయము కలవాడగుటచేతనే - నీ గ్రంథమును విసువుపుట్టకుండ చదువుటకువీలుగా వ్రాసియున్నాడు. పండిత పామరులెల్లరు చదివి హర్షింపదగినది, నిత్యకృత్యములకొన్ని నియమముల నవలంబించిన లాభమొందచేయునది. ఈ గ్రంథమున ఉదహరించిన కావ్యములపట్టిక విడిగానిచ్చిన బాగుండెడిది. మొత్తమునకీ "కృషీవలు"ని కృషి మెచ్చుకొనదగినది. ఈ గ్రంథమునకు తొలిపలుకు శ్రీ మేజరు యం. జి. నాయుడు (ముత్యాల గోవిందరాజులు నాయుడుగారు) వ్రాయుట ఆనందదాయకము. భౌతిక శాస్త్ర వేత్తయు, శస్త్రచికిత్సకుడునగు నీ నాయుడుగారెట్లు మహాకవయిత్రి, ఊహాప్రపంచవర్తియగునా విజ్ఞానమూర్తి శ్రీమతి సరోజినీదేవిగారి ప్రేమనిధానము కాగల్గిరో అన్నప్రశ్నకు సుత్తరముగ ఆయన సంస్కృతి ఔన్నత్యము రేఖామాత్రముగనిందు స్ఫురించుచున్నది. ఇందుకును "కృషీవలుని" మేము మెచ్చుకొనుచున్నాము. దీని వెల రు 2-0-0. వలయువారు దీనిని ప్రచురించిన వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సుకు మద్రాసు వ్రాయుడు.



Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, Kesari Kuteeram Ltd. 15, Westcott Road, Royapettah, Madras Editor : Dr K N. Kesari.